# కాంతి రేఖలు

('యువభారతి'లోని రచనల సంపుటి)



సంకలనం :

మన్నవ గిరిధరరావు, ఎం. ఏ.

ప్రచురణ :

యువభారతి ఎడ్యుకేషనల్ సొసైటి (రిజి)

శ్రీ కృష్ణనగర్ : : గుంటూరు — 522 004



మూల్యము

నాలుగు రూపాయలు

ప్రథమ ముద్రణ : 1975 డిసెంబరు
ప్రతులు : 2000



ముద్రణ :
శ్రీ పి. రామకృష్ణమూర్తి
వెల్‌కమ్ ప్రెస్ ప్రైవేట్ లిమిటెడ్
బ్రాడీపేట, గుంటూరు-2



ముఖచిత్రం :
శ్రీ 'త్రిగుణ్'
విజయవాడ-1

Paper used for the printing of this book was made available by the Government of India at concessional rates, through the Director, A. P. Govt. Text Book Press, Hyderabad. We are grateful to the authorities.

—Publishers.

గౌ॥ శ్రీ పిడతల రంగారెడ్డి,
అధ్యక్షులు, యువభారతి ఎడ్యుకేషనల్ సొసైటీ,
ఆంధ్రప్రదేశ్ ఆర్థికశాఖామాత్యులు.

బేగంపేట,
హైదరాబాద్-16.

# ఒక్క నిముషం!

"I believe
That there are greater things in life
Than life itself" —Elias Liberman

జీవితం విలువైనది. ఆజీవితానికాధారమైన ప్రాణం మరింత విలువైనది. కాని ఆప్రాణాన్ని సైతం లెక్కచేయక అందుకోవలసినలక్ష్యాలు ఈజీవితంలో ఎన్నో వున్నాయని ఎలియస్‌లైబర్‌మన్ హెచ్చరికచేశాడు.

పర్వతారోహకుని లక్ష్యం ఆకాశాన్నంటుతున్న ఆ పర్వత శిఖరాలు. వాటిని అందుకోడానికి అతడు పడేతపన వర్ణనాతీతము. ఒక లక్ష్యాన్ని సాధించినంతనే అతని దృష్టి మరొక లక్ష్యంవైపు, పిదప మరొక లక్ష్యంమీదకు పోతుంది.

ఒకటి సాధించిన మాత్రాన తృప్తిపడే స్వభావంకాదు మానవునిది. వెబ్‌స్టర్ నుడివినట్లు 'There is always room at the top' అని విశ్వసిస్తాడు. ఎంత సాధించినా యింకా అందుకోవలసినది ఎంతో వున్నదని నమ్ముతాడు. నిరంతర సాధనలోనే, ఆ అసంతృప్తిలోనే అతనికి తృప్తి. జీవితమునేది అట్టి సాధనకుపకరించే పరికరం మాత్రమే.

ఉదాత్తమైన లక్ష్యసాధనకై జీవితాన్ని అంకితంచేసే దృష్టి నేటి యువతరంలో లోపిస్తున్నది. నిత్యమూ వేగంగా మారుతున్న పరిస్థితులలో ఎలా ఇమడాలో వారికి తోచడంలేదు. మరియొకవైపున జీవన మూల్యాలను పోషించుకొని పెంపొందించుకోవలసిన ఆవశ్యకతను వారు

విస్మరిస్తున్నారు. ఈ రెంటిని సమన్వయపరచుకోవలసిన అగత్యం ఎంతైనా వున్నది.

ఇది ఇలావుండగా, 28 సంవత్సరాల క్రిందట మనం పొందిన స్వాతంత్ర్యం మనమీద ఎన్నో బాధ్యతల నుంచింది. స్వరాజ్యం రాక పూర్వం ఆంగ్లేయులను ద్వేషించడమే దేశభక్తిగా చెలామణి అయింది. అందుమూలాన శత్రువును వెళ్ళగొట్టగలిగామేగాని దేశాభివృద్ధి కది దోహదం కలిగించలేదు. అందుకై హృదయాంతరాళం నుండి మాతృ దేశాన్ని ఇచటి ప్రజలనూ ప్రేమించి వారికై శ్రమింపజేసే నిర్మాణాత్మకమైన దేశభక్తి, భావపరంపర నేడు అత్యంత అవసరమైయున్నవి.

అంతేకాక, జాతి పునరుజ్జీవనమునకు తోడ్పడే ఆలోచనా పరంపర, వ్యక్తికి సమాజం యెడలగల బాధ్యతలు, నిరంతర క్రియాశీలత, ఇత్యాది మౌలిక సత్యాలను వెల్లడించి వివరించే అగత్యం నేడు అత్యధికంగా వున్నది.

ఇలా తమస్సునుండి జ్యోతిస్సులోనికి చేయిపట్టుకు నడిపించే స్నేహహస్తంకొరకు నేటి యువతరం అర్రులుజాస్తున్నది. అట్టి స్నేహ హస్తం అందించడంకోసమే, అప్రయత్నం యొక్క రూపమే, "యువ భారతి ఎడ్యుకేషనల్ సొసైటీ" ఆవిర్భావం. దాని ఆధ్వర్యమున "యువ భారతి" మాసపత్రికను 1969 నుండి గుంటూరు నుండి ప్రచురిస్తున్నాము. నా మిత్రులు, ఇదివరలో శాసనమండలి సభ్యులు శ్రీ మన్నవ గిరిధరరావు ఈ పత్రికా నిర్వహణ బాధ్యతను వహించారు.

గత కొలది సంవత్సరాలుగా "యువభారతి"లో వెలువడిన రచనలలో విశిష్టమైన కొన్నిటిని ఈ పుస్తకరూపంలో పాఠకుల ముందుంచుతున్నాం. స్వరాజ్యం గురించి సరియగు అవగాహన, కార్యశీలత గురించిన

వివరణ, వ్యక్తిగత శీలముయొక్క నిర్మాణముల గురించిన రచనలు ఇందు పొందుపరచబడ్డాయి.

ఇందలి ప్రతివ్యాసమూ ఒక కాంతిరేఖగా ఉపకరించి పాఠకులలో ఉత్సుకతను కలిగించగలదని మా ఆకాంక్ష. ఇట్టి పుస్తకాలు మరికొన్నిటిని వెలువరించ దలచాము. పాఠకులనుండి నిర్మాణాత్మక సలహాలను ఆహ్వానిస్తున్నాం. ఈ గ్రంథ ప్రచురణకై విరాళములిచ్చి సహాయపడిన ఉదారహృదయులకు మా ధన్యవాదాలు.

—o—

ఆచార్య యస్వీ జోగారావు, ఎం. ఏ., పిహెచ్.డి.
ఆంధ్రశాఖాధ్యక్షులు,
పోస్టుగ్రాడ్యుయేట్ సెంటర్, గుంటూరు.

## మనసులోని మాట

మనసు తలుపులు కన్నులు తెరిచి చూతునుగదా కాంతి రేఖలు కొన్ని లోపల ప్రవేశించాయి. కొన్ని పలుకులు బయటికి ప్రసరించాయి. ఏమిటా ఈ మాటలు మామూలుగా గాక మరో వాలకం వేసుకొని వస్తున్నాయని విస్తుపోయాను నాలో నేనే. అది అంతేలే, ఒకప్పుడు సత్యం విస్మయావహంగానే వుంటుందిలే అనిపించి సంతృప్తిపడ్డాను.

ఇవిగో ఆ పలుకులు - మథనపడిన మనసు చిలుకులు:

బ్రదికి చెడిన దేశము చెడి బ్రదుకుచున్న
దేశము భరతదేశము దీని హీన,
బహుముఖీన దీనస్థితిఁ బారఁజూచి
బోరుమని యేడ్చునట్టిదు పొడమె నేఁడు!

ఇదమిత్థముగ కుడియెడమలుగా మంచి
చెడు తేర్పరుపలేని బడుగువారు
చెడు చెల్లుబడిఁజూచి కడు మంచిగా భ్రాంతి
పడి తృప్తిగాఁ బ్రొద్దుగడపువారు
చెడును గ్రహించియుఁ జేయునదేమి క
న్పడక రాజీపడి బ్రదుకువారు
కర్తవ్యబోధము కాస్త గల్గియుఁ గార్య
శౌర్యములేక కొల్జాచువారు

భళిర! యిట్టి నిర్గుణ పరబ్రహ్మలెట్లు
పుట్టిరో భారతము పుట్టినట్టిచోట
వారి నడుమనుండియె యూడిపడెనొకండు
చెడును ద్రుంచి మంచినిఁ బెంచు చేవగలఁడు.

ప్రాచీనమైన దాన స
మీచీనం బయినదాని మేలిమిఁ దన ధీ
సాచివ్యముతో జాతికి
కాచి వడంబోసి తగు నగదముగ నొసఁగున్.

నవభారత యువభారతి
కవసరమగునంత మేర కఖిల విషయముల్
నవ మానవ జీవన మను
భవమును నవగాహన నవభావన తీరుల్.

వివరించుట తన జీవిత
హావమై కొండంత క్రొత్తయాశను హృదులన్
జివురింపఁజేయు నన్మ
న్నవగిరిధరుఁ డితఁడు మన్ననకుఁ బాత్రుఁడగున్.

కాంతియున్నను గనుగొనన్ గనులు వలయు
కన్నులున్నను ఇరులలో కర్జ మేమి?
కర్జమగుఁ గనుల్ కాంతిరేఖలును గలుగ
కాంతు లివిగొ కనుల్ విప్పి కాంచరండు!

కుఱ్ఱలార! లేలేఁతలు బుఱ్ఱలార!
చీకువాలునఁ గూర్చుండి జింతిలకుఁడు
కాంతిరేఖలు నలుగడఁ గ్రమ్మె నివిగొ
రండు! రండు! కర్తవ్య సారథులు కండు.

జాతికి మార్గదర్శకుడు కావలసినవాడు ఉపాధ్యాయుడు. భావి రాచబాట వేయవలసినవాడు విద్యార్థి. ఆయుభయుల హస్తముల నలంకరించునుగాక ఈ పుస్తకము!

ఈ ప్రచురణకై విరాళములిచ్చిన

ఉదార హృదయులు

శ్రీ చగన్‌రాజ్ తలేసిరా

చందాజీ ఖుబాజీ కంపెనీ, గుంటూరు-3 రు 600

శ్రీ తెల్లాకుల జాలయ్య, Ex-M. L.A.,

Ex-Municipal Chairman, గుంటూరు-3 రు 250

శ్రీ మాజేటి వెంకట రామకోటి ముత్యాలు, బి. కాం.,

కార్యదర్శి మాజేటి గురవయ్య హైస్కూలు, గుంటూరు-2 రు 250

శ్రీ కొంజేటి రోశయ్య, ఎం. ఎల్. సి., తెనాలి రు 200

శ్రీ దొడ్డాల వెంకటరావు, బి. ఏ., బి. ఎల్., గుంటూరు-2 రు 115

శ్రీ పడమటి చెంచయ్య

ఫిజికల్ డైరెక్టరు, పొన్నూరు రు 116

శ్రీ పచ్చల కోటేశ్వరరావు, గొట్టిపాడు, గుంటూరు తా॥ రు 50

వీరికి మా ధన్యవాదములు.

—ప్రచురణకర్తలు

## ఇదీ వరుస

# ఐకమత్యమే జీవనసూత్రం

ఒంటరిగా కాలువగట్టున ఐదుమైళ్ళు నడవడం మహా దూరం అనిపిస్తుంది. కాళ్ళు పీక్కుపోతాయి. ఊరు ఇంకా రాలేదే అని విచారం కలుగుతుంది.

నలుగురు మిత్రులు కలిసి మాటలాడుకుంటూ అదే కాలువగట్టున నడుస్తూవుంటే కాళ్లు నొప్పులనిపించవు. దూరమనిపించదు. ఊరు అందివుచ్చుకున్నట్లు వుంటుంది. ఎందువల్ల?

అప్పుడు నడిచిందీ ఇప్పుడు నడిచిందీ ఐదు మైళ్లే; అవేకాళ్ళు; అదేదూరం. ఎందుకు విసుగు పుట్టలేదు?

పది మంది కలిసి చేసేపనిలో ఆనందం వున్నది, సంతోషం వున్నది; సుఖం వున్నది; ఉల్లాసమున్నది; అన్నిటి కంటె ముఖ్యంగా 'విజయం' ఉన్నది.

పది మంది కలిసివున్నప్పుడు వారిలో ధైర్యం కలుగుతుంది. ఇబ్బందులనూ కష్టాలనూ ఎదుర్కోవలసి వస్తే అందరూ కలిసి ఎదుర్కొంటారు. ప్రతి ఒక్కనికీ తన వెనుక తొమ్మిది మంది ఉన్నారనే ధైర్యం వుంటుంది. భయాన్ని వాళ్ళు దూరం చేసుకుంటారు.

అంతే కాదు. కేవలం ఇరువురు కలసి మెలసి వున్నా వారు

అధికంగా సాధించగలరు. గణితశాస్త్రంలో దీనికొక చక్కని ఉదాహరణ వున్నది.

'a' ను 'a' తో హెచ్చవేస్తే '$a^2$' వస్తుంది.

'b' ను 'b' తో హెచ్చవేస్తే '$b^2$' వస్తుంది.

కాని '$a+b$' ని '$a+b$' తో హెచ్చవేస్తే '$a^2+b^2+2ab$' వస్తుంది.

ఈ '$2ab$' అదనంగా ఎందుకు వచ్చింది? a, b ల నడుమ '+' ఉండటంవల్ల వచ్చింది. ఆ రెండూ సమైక్యం కావడంవల్ల వచ్చింది.

అలాగే ఇరువురు వ్యక్తులు ఎవరికివాళ్ళు ఎంత అభివృద్ధిగాంచినా అది $a^2$, $b^2$, మాత్రమే అవుతుంది. వారు సమైక్యంగా కృషి చేసినట్లయితేనే వారిఅభివృద్ధి $a^2+b^2+2ab$ అవుతుంది.

ఐకమత్యమే జీవనసూత్రం; సామూహిక కృషియే మన అభ్యున్నతికి మార్గం. అదే మనకు తారకమంత్రం. కేవలం ఇరువురి నడుమ '+' గుర్తువుంచితేనే ఇంతటి అదనపు ఫలితం వచ్చింది. మరి 66 కోట్ల భారతప్రజలనడుమ 'ప్లస్' గుర్తులు పెట్టుకుంటూపోతే ఫలితం ఎంత బాగుంటుంది!

---

# మూల్యం ఎంతచెల్లించాలి !

సూర్యరశ్మి, చల్లగాలి, వర్షపునీరు మినహా లోకంలో ఏవస్తువూ ఉచితంగాలభించదు. ఏదీ డబ్బుపెట్టి కొనకుండా చేతులో పడదు.

ప్రతి వస్తువుకూ వెలచెల్లించాలి. వేసవిలో కొన్ని చోట్ల బిందెకు నీళ్ళు రూపాయి కమ్ముతారు. పన్నుతోము పుల్లలు మొదలు బొగ్గులబస్తావరకు, స్నోసీసా మొదలు కూల్ డ్రింక్స్ వరకు డబ్బులక్కడపెట్టి మరీ తీసుకోవాలి. కేపిస్తానంటే గేపే వచ్చి తీసుకోమంటారు.

ఇంట్లోవున్నందు అద్దె; ఫోనుచేసినందుకు చార్జి; ఇలా కదిలితేడబ్బు మెదిలితేడబ్బు చెల్లిస్తూవుంటాం. మందు పుచ్చుకున్నందుకే గాక డాక్టరుతో మాట్లాడినందుకు ఫీజు చెల్లిస్తాం.

అయితే ఒకదేశంయొక్క భూభాగంలో నివసిస్తున్నందుకు, ఆదేశానికి చెందిన భూమిలో పంటపండించుకుంటున్నందుకు, ఆ నేలమీద ఇల్లు కట్టుకున్నందుకు, అచటి జలము త్రాగుచున్నందుకు, అచటి ప్రకృతిని తిలకించి ఆనందిస్తున్నందుకు, అచటి మలయమారుతం అనుభవిస్తున్నందుకు

మనమేమి మూల్యం చెల్లిస్తున్నాం ?

'దీని వెల ఎంత ?' అనే సందేహం కొందరికివస్తుంది. తల్లి బిడ్డను పెంచినందుకు ఖరీదెంత అంటే ఏమిచెప్పగలం? తనరక్తాన్ని పాలుగామార్చి బిడ్డనుపెంచి పెద్దచేసినందుకు ఖరీదెంత ? రూపాయలలో విలువకట్టలేనిది, అమూల్యమైనది.

ఏదిలేకుండా మనము లేమో అటువంటి మాతృభూమి నుండి మనం పొందుతున్న ప్రయోజనాలకు ఖరీదెంత? ఎంత సొమ్ము చెల్లించాలి? ఏరూపంలో చెల్లించాలి? అనే విషయాన్ని మనసులోకి తీసుకోవలసిన అవసరం వున్నది.

'ఇవి వాటంతటవి వచ్చిన అవకాశాలు. ఉచితంగాలభించేవి. వీటికి మనమేమీ తిరిగియివ్వ నవసరంలేదు' అని పలువురిఉద్దేశ్యం. అదిపొరబాటు. డాక్టరు మందిచ్చినందుకు గాక అతనితో సంభాషించినందుకే కన్సల్టేషన్‌ఫీజు మనం చెల్లిస్తున్నపుడు మనఉనికికి (existence) అవకాశమిచ్చిన మాతృభూమికి ఏమీ చెల్లించ నవసరంలేదా ?

దేశమంటే మనతో మాట్లాడలేని నేల మాత్రమే కాదు; దేశమంటే మనకు అనుదినమూ కనిపించే సజీవమైన సమాజం. 'ఈ సమాజ క్షేమంలోనే నా క్షేమం ఇమిడివున్నది' అనే ఆలోచన, 'నాకుగల శక్తి సామర్థ్యాలు, మేధస్సు, ధనము-వీటన్నిటిని. నాకొరకే గాక సమాజంకొరకుగూడ

వినియోగిస్తాను' అనే గ్రహింపు అనుదినమూ మనస్సులోకి తెచ్చుకోవడమే దేశానికి చెల్లించే ఫీజు !

---

పనిలోని మాధుర్యం-1

## క్రియాశీలత

మనదేశంమీద శత్రుదండయాత్ర జరిగిన రోజుల్లో ఒక యువకునిలో దేశాభిమానం పెల్లుబికి కాలేజి చదువు ఆపివేసి ఇంట్లో కూడ చెప్పకుండ రిక్రూటింగ్ ఆఫీసుకు వెళ్ళి సైన్యంలో చేరాడు.

అతనిని శిక్షణకొరకు బెంగుళూరు పంపారు. ఆరు నెలలు గడిచాయి. యుద్ధం ఆగిపోయింది. మామూలు రోజులు వచ్చాయి. శిక్షణపొందుతూ నేవున్నాడు. కాని ఇంటిమీదకు మనసు మళ్ళింది. చెల్లెలూ తమ్ముడూ గుర్తొస్తున్నారు. ఒంటరిగా గదిలో కూర్చొని కన్నీళ్ళు పెట్టుకుంటున్నాడు.

ఈ సంగతి అధికారికి తెలిసింది. ఆ యువకునికి ధైర్యం చెప్పడంఎలా? ఉత్సాహపరచే మార్గమేమిటి ?

యువకుణ్ణి పిలిచాడు. దూరంగా ఒక చెట్టు చూపిం

చాడు. దానిక్రింద రెండుగజాలపొడవు, రెండు గజాల వెడల్పు రెండుగజాలలోతు గల గోతిని త్రవ్వమని పంపించాడు. ఆయువకుడు రోజల్లా పనిచేసి గొయ్యి త్రవ్వివచ్చాడు అధికారివద్దకు.

"అదేమట్టితో దాన్ని పూడ్చ" మని మరొక ఆజ్ఞ ఇచ్చాడు అధికారి. యువకుడు చిరునవ్వునవ్వి గుంటను పూడ్చి వచ్చాడు.

"ఇప్పుడు మనస్సు ఎలావున్నది ? హాయిగావున్నదా ? ఇంటి విషయం మనస్సులోకిరానివ్వకు. మనం ఎక్కడుంటే అదే సర్వస్వం. పనిలో మునిగివుంటే ఏదీ గుర్తుకురాదు. పనికోసమే మనంపుట్టాం. పనిలోనే ఆనందం. అంటూ బిస్కట్లు, టీ, తెప్పించి ఇచ్చాడు అధికారి,

అసలు పని అనేది మందుగా పనిచేస్తుంది. మనోరుగ్మతకు మందు ఏమిటీ అంటే పని !

ఒకసన్యాసిని ప్రశ్నించారు: "మీరు కామాన్ని ఎలా జయించ గలిగారు?" అని. అందుకాయన "కామం నావద్దకు వచ్చినపుడల్లా నేను ఏదోపనిలో నిమగ్నుడనై వుంటాను. అందుచేత అది నన్నేమీ చేయలేకపోయింది" అని అన్నాడు.

నిజానికి పనిలో నిమగ్నమవడమనేది అభివృద్ధికి సోపానం; పనినుండి తప్పించుకోవడం పతనానికి మార్గం.

అందరూ ఇలా అనుకోరు, ఏపనీ లేనివాడు సుఖజీవి

అని పలువురి ఉద్దేశం. ఏపనీ లేకుండా కాలుమీద కాలువేసు కొని కూర్చోవడాన్ని అదృష్టంగా పలువురు భావిస్తారు. అది అదృష్టంగాదు దురదృష్టం.

వాడకపోతే యంత్రం తుప్పుపట్టినట్లు కర్మ చేయనివాడు నిరర్థకుడవుతాడు. జీవంగల మొక్కలకు పెరగడం ఎలాసహజమో బ్రతికియున్న వ్యక్తికి క్రియాశీలత సహజగుణం. నాడి ఆడితే బ్రతికున్నట్లు కాదు; పనిచేస్తే జీవించినట్లు. కదలలేని శవానికీ, నిష్క్రియుడైన వ్యక్తికీ, తేడా లేదు.

ఇల్లు, వాకిలి, ధనము, ధాన్యము గలవాడు కూడ పని చేయాలా? అతడెందుకు పళ్ళవంచడం? అనే ప్రశ్నకు ప్రత్యుత్తరం శ్రీ కృష్ణుడు ఇలాయిచ్చాడు :

"అర్జునా! నేనీ ముల్లోకములలోను చేయ వలసిన కార్యములేదు. నాకు లేనిదియు, నాకు కావలసినదియు ఏమీ లేదు. ఐనను విరామంలేకుండా నాపని నేను చేస్తూనే యుంటాను" అని భగవానుడు భగవద్గీత మూడవ అధ్యాయంలో చెప్పాడు.

ఎందుకు అలాచేయడం? తనకు అన్నీవున్నపుడు, తానే అన్నీ అయినపుడు పూరక కాలం గడపరాదా? పనిచేయడ మెందుకు ?

"ఏల యనగా, నేనెల్లపుడును నాకర్తవ్యము నిర్వహిం

చకున్నచో, మనుష్యులు నామార్గమునే అనుసరించి కర్తవ్య విముఖులవుతారు" అన్నాడు భగవానుడు.

భగవంతుడంటే ఎవరోగాదు. ప్రకృతి భగవంతుని రూపం. ప్రకృతిలో జరుగుచున్న ఆశ్చర్యకరమైన సంగతి ఏమంటే, గంటకు షుమారు 1,000 మైళ్ల వేగంతో భూమి తన చుట్టూ తాను భ్రమించుతూవున్నది. ఇందుమూలాన సూర్యోదయ సూర్యాస్తమయాలు ఏర్పడుతున్నాయి. అంతేగాక గంటకు 66,000 మైళ్ల వేగంతో భూమి సూర్యునిచుట్టూ పరిభ్రమిస్తూవున్నది. తద్వారా ఋతువులేర్పడుతున్నాయి; మేఘములేర్పడుతున్నాయి, వర్షం కురుస్తున్నది; పంటలు పండుతున్నాయి; ప్రాణికోటి జీవించగలుగుతున్నది.

అద్భుతమైన రీతిలో విరామంలేకుండా ప్రకృతిలో జరుగుచున్న ఈ కార్యకలాపం దేన్ని సూచిస్తున్నది ?

నిరంతర క్రియాశీలతయే సృష్టిరహస్యం. అందులోనే అందంవున్నది, ఆనందంవున్నది.

క్రియాశీలతయే ప్రాణం, నిష్క్రియత్వమే మరణం!

---

"ప్రేమయిస్తుందేగాని ఇమ్మనికోరదు. ప్రేమబాధలను సహిస్తుందేగాని ప్రతీకారం తలపెట్టదు." — మహాత్మాగాంధీ

# చంద్రశేఖర అజాద్

అది 1921వ సంవత్సరం. సహాయ నిరాకరణోద్యమం ముమ్మరంగా జరుగుచున్న రోజులవి. దేశంలో పిన్నలు పెద్దలు స్త్రీలు యావన్మందీ సత్యాగ్రహంలో పాల్గొంటున్నారు.

14 ఏళ్ల తరుణ వయస్సులో నున్న చంద్రశేఖర్ ను సత్యాగ్రహంలో పాల్గొన్నందుకు పోలీసులు అరెస్టుచేసి మేజిస్ట్రీటు ఎదుట హాజరుపరచారు.

"నీ పేరేమిటి ?" అని అడిగాడు మేజిస్ట్రీటు.

"అజాద్" అనిసమాధాన మిచ్చాడు చంద్రశేఖర్. (అజాద్ అంటే ఉర్దూలో 'స్వేచ్ఛ' అని అర్థం)

మేజిస్ట్రీటు కోపంతో "నీతండ్రి పేరు?" అని అడిగాడు.

చంద్రశేఖర్ చిరునవ్వుతో "స్వాధీన్" (స్వాతంత్ర్యం) అని జవాబిచ్చాడు. దాంతో మేజిస్ట్రీటు మరింత రెచ్చిపోయాడు. చివరిప్రశ్నగా "మీ దేవూరు?" అని అడిగాడు.

చంద్రశేఖర్ నిర్భయంగా "జైలు" అని అన్నాడు. అక్కడున్నవారంతా ఫక్కున నవ్వారు. బుజ్జివాని ధైర్యానికి చకితులైనారు.

మేజిస్ట్రేటు కోపం పట్టలేక చంద్రశేఖర్ కు 15 హంటర్ దెబ్బల శిక్ష విధించాడు. అతన్ని కాశీ సెంట్రల్ జైలుకు పంపించారు.

శేఖర్ హంటర్ దెబ్బలకు ఎంత నిబ్బరంతో భరించాడో చూసి కాశీ జైలు అధికారి ఆశ్చర్యపోయాడు. కేవలం 14 సంవత్సరాల ప్రాయంలోనున్న చంద్రశేఖర్ శరీరము ఆ దెబ్బలకు చీలి వ్రణయుక్తమయింది. అతడు 'హాం' అని 'గాని' అబ్బా అని గాని అనలేదు. 'వందే మాతరమ్' అంటూ చివరకు స్పృహ లేకుండా పడిపోయాడు.

అసలతని పేరు చంద్రశేఖర్ తివారీ! అతడు పేద కుటుంబంలో జన్మించాడు. కాశీలో చదువుకొనే రోజుల్లో ఒక సత్రంలో ఒకపూట భోజనం మాత్రమే చేసి విద్యార్థిదశ గడిపాడు. ఇతడు 'అజాద్'గా పేరు పొందిన పిదప ఇతనికి సహాయపడాలనే కోరికతో శ్రీ శివరామ ప్రసాద్ గుప్త అను కాంగ్రెస్ వాది ఇతని విద్యాభ్యాసానికి సహాయం చేయడానికై ముందుకు వచ్చాడు. కాని ఆత్మాభిమానంగల చంద్రశేఖర్ అందుకిష్టపడలేదు.

1923 నుండి 1930 వరకు భారతయువకులు విప్లవ కార్యకలాపాలవైపు ఆకర్షించబడ్డారు. గెరిల్లాపద్ధతిలో తిరుగుబాటు తేవడానికై "హిందుస్థాన్ సోషలిష్టు రిపబ్లికన్ అసోసియేషన్" ప్రారంభించారు. ఈరహస్య కార్యకలాపాలలో

పోలీసులను మూడు చెరువుల నీళ్ళు త్రాగించి వారికి చిక్క కుండా తిరిగిన ఖ్యాతి ఒక్క అజాద్ కే దక్కింది.

1928 అక్టోబరు 20వ తేదీన సైమన్ కమీషన్ లాహోరు వచ్చినప్పుడు అసమ్మతి తెలుపుతూ పంజాబ్ కేసరి లాలా లజపతిరాయ్ నాయకత్వాన బ్రహ్మాండమైన నల్ల జెండాల ప్రదర్శన జరిగింది. ఆసమయంలో పోలీసు సూపరిం టెండెంటు సాండర్స్ అను ఆంగ్లేయుడు చేయించిన లాఠీ చార్జీకి గురియైన లాలాలజపతిరాయ్ ఆదెబ్బలతో మర ణించాడు.

అటువంటి సాండర్స్‌ను నెలరోజులు గడవక ముందే హత్యచేయాలని విప్లవకారులు నిర్ణయించుకున్నారు. ఒకే ఒక నెలతరువాత లాలాజీ మొదటి మాసిక శ్రాద్ధంనాడు భగత్ సింగ్, రాజగురు, చంద్రశేఖర అజాద్‌లు లాహోర్ పోలీసు స్టేషను ముఖద్వారంవద్ద సాండర్స్‌ను మోటారు సైకీలుపై వస్తుండగా కాల్చిచంపారు. ఈ దేశానికి అవమానం కలిగించేవారికగతి ఏమవుతుందో ప్రపంచానికి తెలియ జెప్పారు !

బ్రిటిష్ ప్రభుత్వం కళ్ళలో వత్తులు వేసుకొని మూడేం డ్లపాటు వెదికింది. కాని అజాద్ చిక్కలేదు. అతని శిరస్సు తెచ్చి ఇస్తే పదివేలరూపాయల బహుమతి ఇస్తామని ప్రభుత్వం ప్రకటించింది.

1931 ఫిబ్రవరి 27వ తేదీన చంద్రశేఖర్ అజాద్ అలహాబాద్‌లోని ఆల్‌ఫ్రెడ్ పార్కులో తన మిత్రునితో సంభాషణ జరుపుచుండగా, అతని స్నేహితుడే మరొకడు డబ్బుకాశపడి పోలీసు దళాలకు అజాద్ ఉనికి చెప్పాడు. సాయుధపోలీసులు పార్కులో ప్రవేశించారు.

నాద్‌వార్ అనే పోలీసు ఆఫీసరు పోరుకు సిద్ధంగాలేని అజాద్ తొడమీద పిస్తోలు పేల్చాడు. వెంటనే అజాద్ పిస్తోలు నుండి గుండు దూసుకువెళ్ళి ఆ పోలీసుఆఫీసరు చేతిని ఎగుర గొట్టింది. అపుడు అజాద్ ఒక చెట్టుచాటుకు వెళ్ళి రక్షణ పొందాడు.

కాని ఎంతసేపు ఆ చెట్టు అతన్ని రక్షిస్తుంది? గుళ్ల దెబ్బలతో అశక్తుడై నేలకొరిగిపోయాడు. ఆసమయంలో విశ్వేశ్వరసింగ్ అనుపోలీసు అజాద్ దగ్గరకు వెళ్లాడు. వెంటనే అజాద్ పిస్తోలునుండి గుండు దూసుకు వెళ్ళి ఆపోలీసు దవడల్లో గుచ్చుకొని అతని ప్రాణాలను అనంతవాయువుల్లోకి పంపింది.

పోలీసులు అజాద్ దగ్గరకు వెళ్ళకుండా అతనిపై గుండ్లవర్షం కురిపించారు. అజాద్ చనిపోయినా అతని దగ్గరకు వెళ్ళడానికి భయపడి ఆతని శవంమీదనే వారివద్దనున్న గుండ్లు అయిపోయేదాకా కాల్పులు జరిపారు. ఆఖరుకు

"ధైర్యం" చేసి అజాద్ శవాన్ని బంధించారు. అంతేగాని అతడు బ్రతికుండగా బ్రిటిష్ వారికి చిక్క లేదు!

—శ్రీ బొండాడ రామారావు, బి. కాం., బి. ఎల్.
అనకాపల్లి.

---

చిన్నకథలో పెద్దగుణపాఠం-1

## శీలంపోతే అన్నీపోతాయి!

ప్రహ్లాదుడు తానొనర్చిన పుణ్య కర్మల ఫలితంగా ఇంద్రుణ్ణి వెడలగొట్టి సింహాసన మధిష్ఠించాడు.

ఇంద్రుడు దేవతల గురువైన బృహస్పతిని చేరి, "స్వామీ! నాయొక్క దయనీయమైనస్థితి మీరు ఎరిగినదే గదా. నాసింహాసనం మరల పొందడానికి ఏమిచేయవలెనో సెలవిండు" అని అడిగాడు.

అపుడు బృహస్పతి "నీవొక సామాన్య భిక్షకుని వేషం దాల్చి ప్రహ్లాదుని కొలువుకుపోయి, ఇచ్ఛాదాన సమయంలో (అనగా భిక్షకులు ఏది అడిగిన అది ఇచ్చేసమయంలో) అతని శీలాన్ని దానమడుగు" మని సలహా చెప్పాడు.

ఇంద్రుడు బిచ్చగాని వేషంలో ప్రహ్లాదుని వద్దకు వెళ్ళి అతని శీలాన్ని దానమడిగాడు. "కేవలం నాశీలంతోనే నీవెట్లు తృప్తి చెందుతావు?" అని ప్రహ్లాదుడడిగాడు.

"నాకిదిచాలు" అని యాచకుడు బదులు చెప్పాడు. "తీసుకో" అని ప్రహ్లాదు డన్నాడు. అతడు ఆమాట పలికిన వెంటనే ఒక తేజోమూర్తి అతని దేహంనుండి వెలుపలికి వచ్చి బిచ్చగాని దేహంలో ప్రవేశిస్తున్నది.

"నీవెవరవు? నాదేహాన్ని విడిచి ఎందుకు వెళుతున్నావు? అని ప్రశ్నించాడు. "నేను నీశీలాన్ని. నీవు నన్నాతనికి దానంచేశావు కనుక నేనిప్పుడాతనిలో ప్రవేశించాలి" అని ఆ తేజోమూర్తి బదులు చెప్పింది.

మరుక్షణంలో వేరొక తేజోరాశి అతనిదేహంనుండి వెలికివచ్చింది. మరల ప్రహ్లాదుడు "నీవెవ్వరవు? నాదేహాన్ని ఎందుకు విడిచివెళుతున్నావు!" అని ప్రశ్నించాడు. "నేను నీశౌర్యమును. నేను శీలము యొక్క సేవకుణ్ణి మాత్రమే. నీలో శీలమున్నంత కాలము నేనుగూడ నిన్ను సేవించాను. ఇపుడు శీలము వెళ్ళిపోయింది గనుక నేనుగూడ శీలాన్ననుసరించి పోతున్నాను" అని పలుకుతూ ఆ తేజోరాశిగూడ బిచ్చగానిలో ప్రవేశించింది.

చివరకు దేదీప్యమానమైన స్త్రీ ఆకృతి గల ఒక తేజోమూర్తి అతని దేహంనుండి వెలికి వచ్చింది. ఆమె "నేను

నీయొక్క రాజ్యలక్ష్మిని. నేనుగూడ శీలముయొక్క సేవకురాలనే. నీవు శీలాన్ని దానమిచ్చావు గనుక నేను గూడ పోతున్నాను" అన్నది. దానిఫలితంగా ప్రహ్లాదుడు తన సంపూర్ణ అధికారాన్ని వైభవాన్ని కోల్పోయాడు.

మనకు శీలం ఉంటేనే దేన్నైనా సంపాదించగలం. శీలం నష్టపోతే ప్రతిదాన్నీ కోల్పోతాం!

— మహాభారతము నుండి.

---

పనిలోని మాధుర్యం-2

## ఇష్టాయిష్టాలు

పని ఒకవిధమైన ఆనందాన్ని ఇస్తుంది. పసిపిల్లలకు పని చెపితే ఉల్లాసపడుతారు. 'నాకు పని చెప్పు, పని చెప్పు' అని వెంట పడుతారు. ఎందువల్ల? తనవల్ల ఒక పని జరిగితే తానొక ప్రయోజకుడననే సంతోషం కలుగుతుంది. శరీరం పనికోసం ఏర్పడింది. అందుకే పనివల్ల శరీరానికి రాణింపు కలుగుతుంది.

కొన్ని పనులు ఇష్టమైనవి, మరికొన్ని ఇష్టంకానివి వుంటాయి. పూలదండలు కట్టడం ఇష్టమైనపని, సైకిలు బాగు చేయడం ఇష్టంలేనిపని. కొందరికి తెలుగుపాఠం చదవడం ఇష్టం;

ఇంగ్లీషుపాఠం అయిష్టం. మరికొందరికి ఆజ్ఞాపించడం ఇష్టం; ఆజ్ఞను అనుసరించడం అయిష్టం.

ఇష్టంకాని పనులను ఇష్టమైనవిగా చేసుకోవడం వివేకవంతుని లక్షణం. ఇష్టం కానంతమాత్రాన సైడుకాలువ బాగు చేసుకోకుండావుండడం; అన్నంతిన్న విస్తరి ఎత్తుకోకుండావుండడం. ఎండల్లో పొలందున్నుకోక తప్పదు; రోజూ మైళ్ళకొద్దీ నడవక తప్పదు.

అందుకే ఒక ఆంగ్ల రచయిత "నీవు ప్రేమించే పని నీకు లభ్యం కాకపోయినట్లయితే, నీకు లభ్యమైన పనిని ప్రేమించు" (If you can not get the work you love, love the work you get) అని చెప్పాడు.

ఈ మాటలో ఎంతో సత్యంవున్నది. చేసేపనిని ప్రేమించడమే విజయానికి మార్గం. ఇష్టంకాని పని చేయ వలసినపుడు దానిమీద ఇష్టంకలిగించుకోవడంలోనే మనిషి యొక్క గొప్పతనం వుంటుంది. లభ్యమైన పనిని ప్రేమించడమనేది విజయానికి సూటి మార్గం.

ఇలాంటి భావం గల ఒక ఆంగ్లపద్యం వున్నది.

God grant me the serenity
To accept the things I cannot change,
The courage to change the things I can,
And the wisdom to know the difference.
—Dr. Reinhold Niebuhr

హే భగవాన్! నేను మార్చలేని విషయాలను భరించు టకు కావలసిన నిబ్బరాన్ని ప్రసాదించు; నేను మార్చగలిగిన వాటిని మార్చుటకు వలయు సాహసాన్ని సమకూర్చు; ఈ రెండిటి నడుమ వ్యత్యాసాన్ని గ్రహించగల వివేకాన్ని కలి గించు” అన్నాడు కవి. ఇందలి భావం చాలవిశిష్టమైనది.

ఒక యువకుడున్నాడు. అతడు పుట్టుగ్రుడ్డి. తల్లిగర్భం నుండి భూమిమీద పడినపుడే గ్రుడ్డితనం వచ్చింది. తల్లి దండ్రులకు వేరే సంతానంలేదు. అతడొక్కడే కలిగాడు.

ఎందరు డాక్టర్లకు చూపినా నయంకాదన్నారు. ఆ యువకుడు నిరుత్సాహపడలేదు. గ్రుడ్డి వారికొరకు ఏర్పరచ బడిన విద్యాలయంలో చేరి ఎంతో శ్రమచేసి చదివాడు. మెట్రిక్యులేషన్ ప్యాసైనాడు. పిదప కాలేజీలో చేరాడు. రోజూ మరియొకరి సహాయంతో కాలేజీకి వచ్చేవాడు. పి.యు.సి. ప్యాసైనాడు; బి ఏ. ప్యాసైనాడు; ఇప్పుడు ఎం. ఏ. చదువు తున్నాడు. సంగీతం నేర్చుకోవాలని ఉత్సాహపడుతున్నాడు. తాను మార్చలేనిదాన్ని సహించగల నిబ్బరమంటే యిది.

వందసంవత్సరాల క్రిందట హిందూ సమాజంలో కొన్ని వర్గాలలో భర్త మరణిస్తే భార్య మరొకరిని వివాహ మాడే అవకాశంలేదు. ఎంతోమంది బాలవితంతువులు విషా దంతో కుమిలి కృశించేవారు. ఈ దురాచారాన్ని నిర్మూలిం

చడం కొరకు శ్రీ కందుకూరి వీరేశలింగంగారు నిర్విరామ కృషిసల్పారు. ఎన్నో దూషణలను ఎదుర్కొన్నారు. సంఘం నుండి బహిష్కరించినా లెక్కచేయలేదు. మార్చవలసిన దానిని మార్చడంకొరకు కావలసిన సాహసం ఆయన అలవరచుకున్నారు; విజయం సాధించారు. దురాచారం కొంత వరకు అరికట్టబడింది.

అయితే దేన్ని మార్చాలి, దేన్నిసహించాలి అనే వివేకం కావాలి. దాన్ని సమకూర్చమని కవి దేవుని కోరుకున్నాడు పై పద్యంలో.

— శ్రీ ఎం. వి. వెంకటరెడ్డి, ఎం. ఏ., ఎం. ఇడి.,
విద్యాశాఖ డిప్యూటీ డైరెక్టర్, హైదరాబాద్

---

గతం నాస్తికాదు నేస్తం
అది అనుభవాల ఆస్తి
గతాన్ని స్వాగతం చేసుక
భావికి స్వాగతం పలకాలి

— కే. నరసింహారెడ్డి.

# స్వరాజ్య సఫలతకు ఉత్పత్తి దృష్టి ఆవశ్యకత

లోకమాన్య బాలగంగాధర తిలక్‌ను ఒకప్రశ్న అడిగారు, "మనకు స్వరాజ్యం ఎందుకు? బ్రిటిష్ పరిపాలన బాగానే వున్నదిగదా?" అని.

అందుకువారు రెండు మౌలికమైన సంగతులు చెప్పారు. "ఎంతమంచిదైనా పరాయి పరిపాలన స్వపరిపాలనతో సాటిరాదు. నీటిలోపుట్టిన చేప స్వేచ్ఛగా నీటిలో సంచరిస్తున్నది. పక్షి గాలిలో స్వేచ్ఛగా ఎగురుతున్నది. భూమిమీద పుట్టిన మానవుడు స్వేచ్ఛగా జీవించ నవసరంలేదా? మరొకదేశానికి బానిసగావుంటాడా? తనదేశంలో తాను స్వేచ్ఛగామెలగ నవసరంలేదా? జలచరాలకు పక్షులకు గల స్వేచ్ఛ మనకు అవసరం లేదా? మానవునిలోని వ్యక్తిత్వం వికసించడానికి స్వేచ్ఛకావాలి. అదిస్వరాజ్యంలోనే లభ్యమవుతుంది."

అంతేగాక మరొక ముఖ్య విషయం కూడ చెప్పారు. "స్వరాజ్యం కోరడంలో ఉద్దేశ్యం తెల్లదొరల స్థానంలో భారతీయులు రావడమొక్కటే కాదు. ఢిల్లీలో ఆంగ్లపతాక స్థానంలో జాతీయ పతాకం ఎగరడంమాత్రమే కాదు. ఇంతకంటె బలవత్తరమైన ఆవశ్యకత మరొకటి వున్నది.

మనంరోజూ వినియోగించే ఫౌంటెన్ పెన్నులు, గడియారాలు, సైకిళ్ళు, వస్త్రములు, మందులు లాంటివన్నీ ఇంగ్లండులో తయారై వస్తున్నాయి. పదిరూపాయలు పెట్టి బజారులో ధోవతికొంటే అందులో అర్ధరూపాయి మనకమ్ముతున్న చిల్లర వర్తకుడికి పోతుంది. మరొక అర్ధరూపాయి పట్నంలోని టోకు వర్తకుడికి పోతుంది. మరియొక రూపాయి ఇంగ్లండునుండి బొంబాయికి వస్త్రాలు దిగుమతి చేసే పెద్ద వ్యాపారికి చేరుతుంది. మిగిలిన ఎనిమిది రూపాయలు ఇంగ్లండులో వస్త్రాలు ఉత్పత్తి చేసే పారిశ్రామికవేత్తకు చేరుతున్నది. అది అచటి పెట్టుబడిదారునికి లాభంరూపంలోను, ఉద్యోగులకు, కార్మికులకు వేతనం రూపంలోను చెల్లించబడుతున్నది.

ఆ ఎనిమిది రూపాయలు మనదేశంలోనే ఉండిపోయే మార్గం ఏమిటి ? ఆ వస్తువులను ఇచటనే ఉత్పత్తి చేయాలి. అపుడా డబ్బుతో ఈదేశంలోని కార్మికులు ఉద్యోగులు జీవించగల్గుతారు. మనం స్వరాజ్య మెందుకు కోరుతున్నామంటే, మనకు అనుదినమూ జీవితంలో అవసరమైన ప్రతివస్తువునూ మనమే ఉత్పత్తి చేసుకోడానికి; వినియోగదారుడు చెల్లించే డబ్బు ఈ దేశంలోనే వుండిపోవడానికి" అని వారు చెప్పారు.

స్వరాజ్యం వచ్చినప్పటికీ వారు చెప్పిన ఆశయానికి ఇంకా దూరంగానే వున్నాం. గత 28 సంవత్సరాలుగా దేశంలో అనేక పరిశ్రమలు స్థాపించుకున్నాం. గుడ్డలు, కాగితం, విమా

నాలు, రైలు ఇంజనులు, ఉక్కు, సిమెంటు మొదలైనవి ఉత్పత్తి చేసుకుంటున్నాం. ఆహారధాన్యాల ఉత్పత్తి గూడ 57 మిలియన్ టన్నుల నుండి 104 మిలియన్ టన్నులకు పెరిగింది.

అయితే మన అవసరాలకు సరిపడే వస్తూత్పత్తి ఇంకా చేసుకోనలేకపోతున్నాం. ప్రతిసంవత్సరం కోట్లకొలది రూపాయల ఆహారధాన్యాలను, యంత్రసామగ్రి, కాగితం, పెట్రోలు, ఎరువులు, ట్రాక్టర్లు, కార్లు దిగుమతి చేసుకుంటున్నాం. విదేశీ వస్తువులపై వ్యామోహం మనలను ఆవరించివున్నది. అందుచేత వాటి తాలూకు డబ్బు విదేశాలకు అత్యధికంగా చెల్లిస్తున్నాం. విదేశాలకు మన ఎగుమతులకంటె దిగుమతులే ప్రతియేటా అధికంగావున్నాయి. ఫలితంగా ఈనాడు మనం 9000 కోట్ల రూపాయలు విదేశాలకు ఋణపడ్డాము. మన తరువాత రాజ్యం స్థాపించుకున్న చైనాకు విదేశాలలో ఋణమే లేదని తెలుస్తున్నది.

ఈ పరిస్థితి నుండి బయటపడాలంటే ప్రజలలో స్వదేశీ భావన జాగృతంకావాలి. మనం వినియోగించే ప్రతివస్తువూ భారత దేశంలో తయారైనదే అయివుండాలి. స్వదేశీ భావన స్వాతంత్ర్యకాంక్ష — ఈ రెండూ మిళితమై వుంటాయి. అవి విడదీయరానివి!

— (శ్రీ) పిడతల రంగారెడ్డి,
అధ్యక్షులు, యువభారతి ఎడ్యుకేషనల్ సొసైటీ.

మాటా—మంతీ-1

# సాహసమే జాతికి వెన్నెముక

ఇది 1700 సంవత్సరం నాటి సంగతి. రాజపుత్రస్థానంలోని జోధపూర్ రాజ్యంలో ఒక రైతున్నాడు. అతనిపొలంలో పైర్లు పచ్చపచ్చగా పెరిగి పైకివచ్చాయి. కోతల సమయం వచ్చింది. తన కొడుకగు దుర్గాదాస్‌ను పొలంకాపలాకు నియోగించి తాను కూలివాళ్లను పిలుచుకు రావడానికి వెళ్లాడు.

రాజుగారి ఒంటెలు దోవనపోతూ పొలంలో జొర బడ్డాయి. 15 సంవత్సరాల వయస్కుడైన దుర్గాదాసు రాజ భటులతో "ఏమయ్యా! ఒంటెలను పక్కకు తోలండి. మా పంటను అవి ధ్వంసంచేస్తున్నాయి" అని హెచ్చరించాడు.

రాజభటులు తలబిరుసుగా అన్నారు: "అబ్బాయ్! ఇవి రాజుగారి ఒంటెలు. ఎక్కడైనా ఇవి తిరగొచ్చు. బయ టకు తోలడానికి నీవెవరు?"

దుర్గాదాసు మండిపోయాడు. "ఏమయ్యా! మాపైర్లు నాశనం చేసేస్వేచ్ఛ వీటికెవరిచ్చారు? రాజుగారి ఒంటెలైతే ఎవరికెక్కువ? నేను వీటి అంతుతేలుస్తాను" అంటూ చేత నున్న ఖడ్గంతో ఒక ఒంటె తల నరికాడు. చివ్వున రక్తం

చిమ్మింది. తల పోయి దూరంగాపడింది. మిగతా ఒంటెలు దూరంగా పోయాయి.

రాజభటులు పడుతూ వడుతూ ప్రభువు వద్దకుపోయి జరిగిన సంగతి నివేదించారు.

మరునాడు రైతుకు వర్తమానం వచ్చింది ఆస్థానానికి రమ్మని. రైతు భయంతో వణికి పోతున్నాడు. కుమారుడు తండ్రికి ధైర్యంచెప్పి "నాన్నా! నన్నుకూడ దర్బారుకు తీసుకుపో. రాజు గారికి నేను జవాబు చెపుతాను" అన్నాడు.

జోధపూర్ రాజా జస్వంతసింహుడు కొలువు తీర్చి వున్నాడు. తండ్రీకొడుకులు ఎదురుగావచ్చి నిలబడ్డారు.

రాజు రైతును ప్రశ్నించాడు. "ఏమయ్యా! నీకుమారు డేవిధంగా మాఒంటెను నరికాడు? అతనికంత దుడుకు తనమా?"

దుర్గాదాసు చివాలున ముందుకు వచ్చి "మహారాజా! ఏవిధంగా నరికానో చూపమంటారా?" అంటూ అక్కడే వున్న మరొక ఒంటె తలను క్షణంలో నరికివేశాడు!

రైతుకు భయం మిక్కుటమయింది. కొడుకు రెండు నేరాలు చేశాడు. రాజుగారు ఏమిశిక్షవిధిస్తారోనని తల్లడిల్లి పోతున్నాడు.

జస్వంతసింహుడు సింహాసనం నుండి నవ్వుతూ దిగి

వచ్చాడు. దుర్గాదాసు భుజంమీద చెయ్యివేసి, రైతుతో "భలేవాడయ్యా నీకొడుకు! అతన్ని ఈనాటినుంచి నావద్దనే వుంచివెళ్ళు. అతను నావద్ద పెరుగుతాడు" అన్నాడు.

ఆ వీరుడే దుర్గాదాస్ రాథోడ్. ఔరంగజేబు దుశ్చర్యల నుండి జోధపుర రాజ్యాన్ని కాపాడి శత్రువులకు సింహస్వప్నమైన మహాసేనాని.

అత్యాచారాలకు అవమానాలకు తలవంచక వాటి నెదుర్కొనే సాహసమే జాతికి వుండవలసిన సుగుణం. అదే జాతికి వెన్నెముక.

"The Soul of the People" (జాతి యొక్క ఆత్మ) అనే గ్రంథంలో D. G. E. Hall అను చరిత్రకారుడు ఇలా వ్రాశాడు.

"ఒక జాతియొక్క విజయము ఏ యితర సుగుణముకంటె మిన్నగా సాహసముమీదనే ఆధారపడి వుంటుందనే సంగతి నిర్వివాదము. ధైర్యాన్ని అలవరచుకోకుండా ఏజాతీ ఉన్నత స్థానాన్ని ఆక్రమింపజాలదు; కనీసం తన స్వతంత్రమునైనా నిలబెట్టుకోజాలదు. సాహసం లేకుండా ఏ జీవనపథంలో గూడ ముందుకు పోజాలదు. పిరికితనంగల జాతులు పతనంకాక తప్పదు".

(It is evident that there is no quality upon which the success of a nation so much depends as upon

its courage. No nation can rise to a high place without being brave. It cannot maintain its independence even. It cannot push forward upon any path of life without courage. Nations that are cowards must fall.) 

ఈ హెచ్చరికను నిరంతరం మనసునం దుంచుకోవలసిన అగత్యం ఎంతైనా వున్నది.



— శ్రీ పి. వి. సుబ్బరత్నం,
తాడిపత్రి, అనంతపురం జిల్లా.



పనిలోని మాధుర్యం-3

## చెయ్యాని పనిమీద ఆసక్తి!

చాలామంది తాము చేసేపని ఎంతప్రధానమైనదైనా దాని మీద అయిష్టంగా, నిర్లక్ష్యంగా వుంటారు. తమది కాని పనిమీద కొండంత ఆసక్తి చూపుతారు. ఇదొక చిత్రమైన గుణం.

మున్సిపల్ ఆఫీసులో సూపరింటెండెంటుగా వున్న వ్యక్తి తన పనిమీద లక్ష్యంవుంచడు. నేనేగనుక మున్సిపల్ కమిషనరైతే వూరు ఇలావుండనిస్తానా అంటాడు.

పదోతరగతి చదివే విద్యార్థి తన తరగతిలో ప్రథమ శ్రేణి మార్కులు తెచ్చుకుందామనుకోడు. ఈ ఏడు ఏదో

విధంగా నెట్టేస్తాను. పై తరగతిలో అన్నీ ఫస్టుమార్కులే నని కోతలు కోస్తుంటాడు.

ఎం. ఏ. ప్రథమ శ్రేణిలో ప్యాసై లెక్చరరుగా పని చేసే వ్యక్తి ఉత్తమ అధ్యాపకుడుగా పేరొందాలనుకోడు. తన క్లాసుమేటు ఐ. ఎ. ఎస్. ప్యాసై కలెక్టరైనాడు, తాను కలెక్టరు కాలేపోతినే అని చింతిస్తూ వుంటాడు.

చేసే పనిమీద అనాసక్తి, చెయ్యాని పనిమీద ఆసక్తి! ఇవి జీవితంలో విజయాన్ని చేకూర్చవు. అందరూ అన్ని పనులూ చేయలేరు, చేయనవసరమూ లేదు. ఎంత స్వల్పమైనపని అయినా, దాన్ని ఇంకెవరూ చేయలేరని అనిపించేటంత సుందరంగా చేయడంలోనే ఘనత వున్నది.

అమెరికన్ కవి Douglas Malloch దీన్ని దృష్టి యందుంచుకొని చక్కని కవిత వ్రాశాడు. అందలి భావం ఇలా వున్నది :

పర్వతశిఖరం మీద పైపైకి పెరిగే
చేవ వృక్షానివి కాజాలక పోతే
లోయలో పెరుగుచున్న చెట్ల పొదగానైనా వుండు
అయితే, సెలయేటిప్రక్కగా కన్నుల విందుగొలిపే
చెట్లగుబురుగా పెరుగు;
చల్లదనమిచ్చే చెట్టువు కాలేకపోతే
మొక్కగానైనా మొలువు
మొక్కగా ముదము గొల్పలేకపోతే
పచ్చని గడ్డిగా పెరుగు

ఆ పెరగడం గూడ జనులు నడిచేదోవకు
అందం చేకూరుస్తూ పెరుగు;
నీవొక పరిశుళాన్ని వెదజల్లే సంపెంగపూవు కాలేకపోతే
ఒక చిన్న చిట్టి ఎఱ్ఱని పూవుగా జన్మించు
సరోవరంలో పచ్చని ఆకులనడుమ ఎఱ్ఱని పుష్పంగా శోభించు;

ఎందుకంటే :

మనమందరమూ నావసరంగులం కాలేము
మనలో పలువురం నావికులం కావాలి
ఇక్కడ మన అందరికీ ఏదో ఒక పని ఎదురవుతుంది
పెద్దపనులూవున్నాయి చిన్నపనులూవున్నాయి
మనసమీపంలో వున్నపని మనంచేద్దాం;
నీవొక రాజమార్గం కాజాలకపోతే
బండ్లబాటగానైనా రూపొందు;
నీవు కాంతులు విరజిమ్మే సూర్యుడవు కాలేకపోతే
నక్షత్రమై ప్రకాశించు;
పెద్దా చిన్నా అనే పరిమాణంబట్టి
నీ జయాపజయాలు నిర్ణయింకావు;
నీవు ఏస్థానంలోవున్నా ఉత్తమంగావుండు".

కవి రచించిన ఆఖరు రెండు చరణాలు ఇవి:

It is not by size that you win or you fail
Be the best of whatever you are.

ఎంత అద్భుతమైన భావన అందించాడు కవి!

---

# డాక్టర్ బి. ఆర్. అంబేద్కర్

ఇద్దరు బాలురు జబ్బుతో మంచంపట్టిన తమ తండ్రిని చూడడానికి వెళుతున్నారు. రైలుదిగి ఎద్దులబండిమీద ప్రయాణం చేస్తున్నారు. మాటలమధ్య బండివాడికి పిల్లలకులం ఏమిటో తెలిసిపోయింది. అంతే, బండిని ఆపేశాడు. వాళ్ళను ఇష్టం వచ్చినట్లు తిడుతూ కట్టిన ఎద్దులను ఊడదీసి బండిక్రిందికి ఒరిగేటట్లు ఎత్తివేశాడు. ఊహించని ఈ సంఘటనతో పిల్లలిద్దరు నేలమీదకు దొర్లారు. ఎదురుమాటాడకుండా బాలురిరువురు కాలినడకన బయలుదేరారు.

ఆ ఇద్దరిలో చిన్నవాడిపేరు భీమ్‌రావ్ రామ్‌జీ అంబేద్కర్. ఆతడు మహారాష్ట్రలోని రత్నగిరిజిల్లాలో అంబవడేలో 1891 ఏప్రిల్ 14న జన్మించాడు.

మరొకసారి భీమ్‌రావ్‌కి అంతులేని దాహం వేసింది. సమీపంలోని బావిలో నీళ్ళుతోడుకొని గబగబా తాగేశాడు. 'అమ్మయ్య' అనుకుంటున్నాడో లేదో అతన్ని ఎవరో చూడనే చూశారు. పదిమందీ చేరి ఆ పసివాణ్ని చితకబాదారు.

అతడొకసారి పాఠశాలకు వెళుతుంటే దారిలో కుండపోతగా వర్షం పట్టుకుంది. ఒక ఇంటిపంచలో తలదాచుకుంటు

న్నాడు. ఆ ఇంటావిడ అతనిని చూసీ చూడటంతో అమాంతం మెడపట్టుకొని వర్షంలోకి నెట్టింది. ఆ ఊపుకు అతని చేతిలో పుస్తకాలన్నీ చెల్లాచెదరుగా నీళ్ళలోపడి తడిసిపోయాయి. అతను బురదలో పడ్డాడు.

జుట్టు కత్తిరింపించుకుందామని మంగలిదగ్గరకు వెళితే 'నేను నీకు క్షవరం చెయ్యను' అనేవాడు.

'మెహార్' కులంలో పుట్టడమే అతని 'నేరం' అయింది. హిందూసమాజంలో వెలిసిన కులాలలో కొన్నిటిది అగ్రస్థానం; మరి కొన్నిటిది హీనస్థానం. వాటి నడుమ అంటరానితనం. ఒకే మతవిశ్వాసంగల వారిలో ఏడుకోట్లమందికిపైగా అంటరాని వారు అనే పేరుతో ఈసడించబడటం జరిగింది. మహారాష్ట్రలోని మెహార్ కులస్థులుగూడ ఇదే తరగతిలో చేర్చబడ్డారు. ప్రతి ఊరి సమీపంలో మాలపల్లి అనేది విడిగా ఏర్పరచారు.

భీమ్‌రావ్ అంటరానితనంలోని అమానుషత్వాన్ని చదువుకొనేరోజుల్లోనే అనుభవించాడు. తాను అందరిపిల్లల తోపాటు క్లాసులో కూర్చునే వీలులేదు. ఎవరైనా నీళ్లు పోస్తే దోసిటితో తాగాలే గాని స్వయంగా గ్లాసుతో తాగ కూడదు. మాట్లాడేటపుడు నోటికి చెయ్యి అడ్డుపెట్టుకోవాలి. ఈ ఆంక్షలు బాలుడైన భీమ్‌రావ్ మనస్సులో చెరగని ముద్రలు వేశాయి.

తనతండ్రి రెండవవివాహం చేసుకున్నపుడు, తనకాళ్ళ మీాద తాను నిలబడవలసిన ఆవశ్యకత అతనికి కనిపించింది. అందుకై అతడు చక్కగా చదువుకోవాలనుకున్నాడు. ఎన్ని పుస్తకాలు చదివినా అతనికి తనివితీరేదికాదు, కుమారుని జ్ఞాన తృష్ణను గ్రహించిన తండ్రి రామ్‌జీ సక్‌పాల్ కొంతడబ్బును గూడ అప్పుచేసి పుస్తకాలు కొనియిచ్చేవాడు.

భీమ్‌రావ్ బొంబాయిలోని ఎల్‌ఫిన్‌స్టన్ హైస్కూలులో మెట్రిక్యులేషన్ ప్యాసయినాడు. అస్పృశ్యుడన్న కారణంగా అతనికి విద్యాలయంలో సంస్కృతం నేర్పకపోయినా ఆతర్వాత అతడు దానిని పట్టుదలగా నేర్చుకున్నాడు. హిందువులుకాని పాశ్చాత్యులు సైతం సంస్కృతం నేర్చుకుని వేదాలను అర్థంచేసుకుంటూవుంటే హిందూమతానికేచెందిన కొన్ని కులాలవారు సంస్కృతం నేర్చుకోకూడదనే ఆంక్షవుండడం భీమ్‌రావ్‌ను కలతపెట్టింది. 1912లో అతడు బి. ఏ. డిగ్రీ పుచ్చుకున్నాడు.

ఆరోజుల్లో బరోడా సంస్థానాధిపతి శ్రీ శాయాజీరావ్ గయక్వాడ్ చాల ముందుచూపుగలవాడు, సంఘసంస్కరణాభిలాషి. బ్రిటిష్ ఇండియాలో అక్షరాస్యత 12 శాతంవుండగా, ఆయన పరిపాలనలో బరోడా సంస్థానంలో అక్షరాస్యత 40 శాతంవుండేది. అలాంటి శాయాజీరావ్ గయక్వాడ్‌కు ఒక సభలో మేధావంతుడైన భీమ్‌రావ్ అంబేద్కర్ పరిచయమై

నాడు. అంబేద్కర్ యొక్క శ్రద్ధాసక్తులను గ్రహించి అతని విదేశవిద్యాభ్యాసానికై మహారాజా సహాయం చేశాడు.

భీమ్‌రావ్ అమెరికా వెళ్ళి కొలంబియా విశ్వవిద్యాలయంలో ఎం. ఏ., పిహెచ్. డి. డిగ్రీలు పొందాడు. ఊహ తెలిసినప్పటినుండి తాను అనుభవిస్తున్న అంటరానితనం అమెరికాలో కానరాలేదు. 1917లో మాతృదేశానికి తిరిగివచ్చి బొంబాయి లాకళాశాల ప్రొఫెసర్‌గాను, 1935 నుండి ఆ కాలేజి ప్రిన్సిపాల్‌గాను పనిచేశాడు.

అంటరానితనం అతని మనస్సును ముల్లులా గుచ్చుకొని బాధిస్తూవున్నది. ఆయన చూడవలసిన ఫైళ్ళను సహితం బంట్రోతులు చేతికిచ్చేవారు కారు. దూరంనుంచే బల్లమీదికి విసిరేవారు. త్రాగడానికి మంచినీళ్ళు అందించేవారు కారు.

1918లో నిమ్నజాతుల ఫెడరేషన్ అధ్యక్షుడుగా పనిచేసాడాయన. 1920లో "మూకనాయక్" (మూగవాళ్ళకి నాయకుడు) అనే పత్రిక ప్రారంభిస్తూ అందు మొదటి సంచికలోనే ఇలా వ్రాశాడు: "అచేతనమైన రాళ్ళురప్పల్లో గూడ దేవుడున్నాడని హిందూసమాజం నమ్ముతుంది; కాని తన లోనే కొంతమందిని అంటరాని వాళ్ళుగా పరిగణించి కించపరుస్తుంది. ఎంతటి వక్రబుద్ధి!"

ఉద్యోగం వదలివేసి 1920లో ఉన్నత విద్యాభ్యాసానికై లండన్ వెళ్ళి అచట లండన్ స్కూల్ ఆఫ్

ఎకనమిక్స్‌లో ఎం. ఎస్‌సి. డిగ్రీ స్వీకరించాడు. 1923 లో బారిస్టర్ పట్టాపుచ్చుకున్నాడు.

స్వదేశానికి తిరిగివచ్చి నిమ్నజాతుల ఉద్ధరణకై జీవితాన్ని అంకితం చేశాడు. "అంటరానివారికి మరొకరి దయా దాక్షిణ్యాలతో నిమిత్తంలేదు. ఎవరోవచ్చి వారికి మేలు చేస్తారనుకోవడం భ్రమ. వారికివారే ఉద్ధరించుకోవాలి. ఉపన్యాసాలు, వివాదాలు పనిచేయవు. చేతల ద్వారానే పని సాధించాలి. మూఢాచారాలపై తిరగబడాలి" అన్నాడు అంబేద్కర్.

అన్ని పబ్లిక్ చెరువులూ బావులూ అందరూ వాడుకోవచ్చునని ప్రభుత్వం ఉత్తరువులు జారీచేసినా, "మహాద్" పట్టణంలో ప్రజలు దానికి వ్యతిరేకించారు. తన ఆశయాలకు రూపకల్పన చేయడానికి అంబేద్కర్ నడుంకట్టాడు. 1927 లో ఒకనాడు తన సహచరులతో సహా ఆపట్టణం ప్రవేశించి చెరువులోనీటిని తానే ముందుగా స్పృశించాడు. తరువాత వెంట వచ్చిన అనుయాయులందరూ ఆనీటిని త్రాగారు. దైవదత్తమైన నీరు ఈ నేలమీద నడయాడే అందరిదీని అని అంబేద్కర్ చేతలద్వారా నిరూపించాడు.

అంబేద్కర్ అనుయాయులు వీరేశ్వరస్వామి దేవాలయంలోకూడ ప్రవేశిస్తారని ఎవరో వదంతి లేవదీశారు. అపుడు జరిగిన కొట్లాటలో అంబేద్కర్ గాయపడ్డాడు. "మహాద్"

చెరువు తగాదా హైకోర్టు దాకా వెళ్ళింది. చెరువులన్నీ అందరికీ చెందిన ఆస్తులని హైకోర్టు తీర్పు నిచ్చింది.

"ముస్లిములను క్రైస్తవులను స్పృశించడానికి అభ్యంతరంలేని హిందువులకు తమవారిలోనే కొందరిని తాకడానికి అభ్యంతరం ఎందుకుండాలి? అంతేగాక, తమలో వెనుకబడిన వారియొక్క స్వాతంత్ర్యాన్ని హరించిన హిందువులకు స్వాతంత్ర్యం ప్రజాస్వామ్యం కోరేహక్కు ఎక్కడిది? " అని ప్రశ్నించాడు అంబేద్కర్. తన ఉద్యమాన్ని కొనసాగిస్తూ నాసిక్‌లోని కాలారామ్ దేవాలయంలో ప్రవేశం కొరకు మరొక సత్యాగ్రహాన్ని చేశాడు.

1931 లో లండన్‌లో జరిగిన రెండవ రౌండ్ టేబిల్ సమావేశంలో పాల్గొని హరిజనులకు శాసన సభలలో ప్రత్యేక నియోజక వర్గాలు కావలెనని ప్రతిపాదించాడు. ఇట్టి ప్రత్యేక నియోజకవర్గాలు హిందువులకు హరిజనులకు నడుమ అఖాతాన్ని పెంచడానికి కారణ మవుతాయని భావించిన మహాత్మా గాంధీ అందుకు వ్యతిరేకంగా ఆమరణ నిరాహార దీక్ష ప్రారంభించారు. తుదకు గాంధీజీకి అంబేద్కర్‌కు నడుమ 1932 లో పూనాఒడంబడిక జరిగింది. దాని ప్రకారం హరిజనులకు శాసన సభలలో నూటికి పదిహేనుతుల స్థానాలు కేటాయించాలని అంగీకారం కుదిరింది.

5)

స్వరాజ్యం వచ్చిన పిదప డాక్టర్ అంబేద్కర్ మొట్ట మొదటి న్యాయశాఖా మంత్రిగా పనిచేశాడు. ఆయన చైర్మన్‌గా ఏడుగురు సభ్యులతో రాజ్యాంగ రచనకై కమిటీ ఏర్పడింది. ఆయన పారదర్శ్యంలో భారత రాజ్యాంగం రూపొందించబడింది. అందులోని 17వ సూత్రం ప్రకారం దేశంలో అంటరానితనం నిషేధించబడి దానిని ఏరూపంలో పాటించినా శిక్షార్హమని ప్రకటించబడింది. తన జీవితకాలంలో అంబేద్కర్ చిరకాల వాంఛితాన్ని ఈడేర్చుకోగలిగాడు.

1950 లో అంబేద్కర్ సామాజిక న్యాయమే ప్రాతిపదికగా గలిగిన బౌద్ధమతాన్ని స్వీకరించాడు. "ఇప్పుడు నరకం నుండీ బయట పడ్డట్లుగా వున్నది" అని నిట్టూర్చాడాయన.

దేశీయులనుద్దేశించి ఆయన చేసిన హెచ్చరిక ఇది: "తన దేశప్రజల నమ్మక ద్రోహంవల్లనే భారతదేశం తన స్వేచ్ఛను కోల్పోయింది. సింధుకు చెందిన రాజాదహీర్ వద్ద గల సైన్యాధికారులు శత్రువులనుండి లంచాలు తీసుకొని పోరాడనందువల్లనే మహమ్మద్ బిన్ కాశిం సింధును జయించగలిగాడు. పృధ్వీరాజుతో తలపడమని మహమ్మద్ ఘోరీని ఆహ్వానించింది రాజా జయచంద్రుడే. హిందువుల స్వేచ్ఛకై శివాజీ పోరాటం సలుపుచున్నపుడు మిగతా మరాఠా నాయకులు, రాజపుత్రులు, మొగలులకే వత్తాసిచ్చారు......... అలాంటి సంఘటనలు పునరావృతం కాకూడదు. భారత

స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకోడానికి ప్రతి ఒక్కరూ కటిబద్ధులై ఆఖరు రక్తపు బొట్టు చిందేవరకు పోరాడాలి."

డాక్టర్ అంబేద్కర్ కు పుస్తకాలంటే అమిత ప్రేమ. కళ్లకు జబ్బుచేసినపుడు ఇక పుస్తకాలు చదువలేనేమోనని బాధ పడ్డారాయన. న్యూయార్కునుండి 2000 పైగా పుస్తకాలు కొనితెచ్చుకున్నారు. ఆసియా మొత్తం మీద మరెవరికీ లేనంత పెద్ద స్వంతగ్రంథాలయం ఆయనకుండేది.

తన ఆరోగ్యం సరిగాలేకపోయినప్పటికీ, తన తోటమాలి మంచంలో ఉన్నాడని తెలిసి అతని ఇంటికి వెళ్ళి పరామర్శించి ధైర్యంచెప్పివచ్చాడు. ఆమరునాడే 1956 డిసెంబరు 6 వ తేదీన ఆయన దివంగతులయ్యారు.

బెవర్లీ నికోలస్ అను రచయిత అంబేద్కర్ ను భారత దేశంలోని మొదటి ఆరుగురు మేధావులలో ఒకరుగా అభి వర్ణించాడు. అంటరానితనాన్ని దేశంలో లేకుండా చేయుడమే ఆయనకు మనం కృతజ్ఞత చూపే విధానం !

— శ్రీ వంగర సత్యమూర్తి

---

అన్య జనుల నెవరి నంటక ముట్టక
తొలగి తొలగి విడిగ మెలగు చుండ
అవల ద్రోసి మిమ్ము అవని ముందుకు సాగు

— శ్రీ శార్ల వెంకటేశ్వరరావు

స్వరాజ్యం గురించిన అవగాహన- 3

# బానిసకు బాధలెక్కువ; స్వతంత్రుడికి బాధ్యత లెక్కువ!

---

జనవరి ఒకటో తేదీన క్రొత్త క్యాలండర్ కొనగానే పలువురు చేసేపని ఆగస్టు 15వ తేదీ ఏ వారమైనదో చూడడం! ఆనాడు ఆదివారమైతే ఒక సెలవ వృథాఅయిందే అని విచారం. మరొక వారమైతే సెలవుపొందవచ్చునని సంతోషం. అనేకులదృష్టిలో స్వాతంత్ర్యముయొక్క అర్థం – అదొక సెలవురోజు.

మరి కొందరిదృష్టిలో స్వాతంత్ర్యం అంటే "స్వేచ్ఛ" అని భావం. ఇష్టంవచ్చినట్లు వ్యవహరించడం, ఎటువంటిరూల్సు అనుసరించకపోవడం, చట్టాలను మీరిపోయి వ్యవహరించడం, తప్పులు, నేరాలు చేయడానికి స్వేచ్ఛ పొందడం స్వాతంత్ర్యం యొక్క ప్రయోజనాలని వారి అభిప్రాయం.

స్వరాజ్యమనేది అనుభవించే భోగపదార్థమని కొందరిలో నాటుకొనిపోయిన దురభిప్రాయం. ఆంగ్లేయులు ఇదివరలో దేశాన్ని కొల్లగొట్టి ధనరాసులు తరలించుకు పోయారని, వారు వెళ్లిపోయారుగనుక దేశంయొక్క సంపదను భుక్తంచేసుకొనే పని తమదైనదని కొందరు స్వార్థపరులు అనుకొనే అర్థం.

స్వరాజ్యమనే మాటకు సరియైన అర్థం గ్రహించక పోవడంవల్ల ఇలాంటి వ్యర్థమైన భావాలు ప్రజలలో నాటుకు పోయాయి. సరియైన అర్థమేమిటి?

ఇంగ్లీషులో మనకు ఇండిపెండెన్స్ వచ్చిందని చెప్తాము. Independence అంటే ఏమిటి? Depend అంటే ఆధారపడడం; independent అంటే ఒకరిపై ఆధారపడకుండా ఉండడం. A is independent of B అని చెప్పినపుడు A అను వాడు B అను వానిపై ఆధారపడడని అర్థం. అలాగే మనకు Independence వచ్చింది అని అనుకున్నపుడు మనదేశం ఇతర దేశాలమీద ఆధారపడదనీ, తనకాళ్లమీద తాను నిలబడుతుందనీ అనుకోవాలి.

కాని పరిస్థితి అలా లేదు. గత 27 సంవత్సరాలలో ప్రపంచంలో 26 దేశాలవద్ద మనం అప్పులు చేశాం. విదేశాలలో మన ఋణములు 1951 లో రు. 31 కోట్లు కాగా, 1974 లో 9000 కోట్ల రూపాయలకు పెరిగాయి. దేశంలో ఏర్పడిన ఆర్థిక క్లిష్టస్థితికి ఒక కారణం స్వశక్తిమీద ఆధారపడక ఋణగ్రస్థమైన విధానం అనుసరించడమే. "అవి ఎంత బలహీనమైనవైనప్పటికీ మన కాళ్లమీదే మనం నిలబడాలి" అనేది స్వరాజ్యంయొక్క ప్రథమ లక్షణం.

స్వతంత్రమంటే స్వేచ్ఛ అనే భావన పలువురిలో వున్నది. ఐతే ఈ Freedom అనే దానికి కూడ సరియైన అర్థం గ్రహించాలి.

ఒక గృహస్థుడు అప్పుడేపుట్టిన చిలుకను తెచ్చి సుందర మైన పంజరంలో పెట్టి పెంచుతున్నాడు. దానికి కావలసిన కాయలు, పండ్లు, నీరు సమకూరుస్తున్నాడు. రోజూ పంజ రాన్ని పరిశుభ్రం చేస్తున్నాడు. చిలుకకు కావలసిన వన్నీ లభిస్తున్నాయి. కాని దూరంగా ఆకాశంలో ఎగిరే పక్షు లను చూచి తాను ఎగరక పోతినే అని విచారిస్తున్నది. రెక్కలు వచ్చినాయేగాని ఎగరడం అలవడలేదు; పళ్ళు గడు స్తున్నాయి.

ఒకనాడు యజమాని వూరు వదలి వెళ్ళిపోతూ ఆకస్మికంగా చిలుకను గాలిలోకి వదిలిపెట్టాడు. చిలుకకు స్వేచ్ఛలభించింది. అమ్మయ్య అనుకున్నది. మహదానందం కలిగింది. కాని నాలుగడుగులు వేయగానే దానిఎదుట నాలుగు సమస్యలువచ్చి మీదపడ్డాయి.

తనకు ఆహారం ఎక్కడ లభిస్తుంది? దాన్ని ఎలా తెచ్చుకోవాలి? అనేది మొదటిసమస్య.

అలవాటు లేనందువల్ల రెక్కలతో ఎగరడం సాధ్యం కావడంలేదు; కుప్పిగంతులు వేస్తున్నది. ఎగరడంఎలా? అనేది రెండవసమస్య.

ఇది అర్భకపు ప్రాణి, ఎగరడంగూడా చేతకావడంలేదు, దీన్ని పొడిచి చంపుదామని డేగలు, కుక్కలు, కాకులు కార

సిల్లినాయి. ఎవరీ శత్రువులు? వాటినుండి రక్షించుకోవడం ఎలా? అనేది మూడవసమస్య.

ప్రొద్దుగ్రుంకితే తాను ఎక్కడవుండాలి? చెట్టుమీద కొమ్మలనడుమ గూడుకట్టుకోవడంఎలా? అనేది నాలుగవ సమస్య.

ఈ విధంగా స్వేచ్ఛ తెచ్చే ఆనందంకంటే సమస్యలు బాధ్యతలు అధికంగా వుంటాయి. స్వేచ్ఛ అనేది కొండంత బరువును ఇష్టపూర్వకంగా మీద వేసుకొనే ప్రక్రియ!

స్వరాజ్యం వచ్చిననాటినుండి ఎంతటి బాధ్యతలు భారతప్రజలమీద పడ్డాయో వారికే తెలియదు. దేశాన్ని శత్రువులనుండి కాపాడుకోవడం, దారిద్ర్యాన్ని నిర్మూలించడం అందరికీ పనికల్గించడం, అంతర్గతంగా దేశం బలిష్టమవడం లాంటి ఎన్నో బాధ్యతలు ప్రజలమీద పడ్డాయి.

బానిసకు బాధలెక్కువ; కాని స్వతంత్రుడికి బాధ్యత లెక్కువ!

---

తల్లిశరీరాన్ని పోషించి పెంచుతుంది; ఉత్తమ గ్రంథం హృదయాన్ని పోషించి పెంచుతుంది.

— శ్రీ రావూరు సత్యనారాయణ

మహాత్ముడు ఆసనంనుండి లేచినపుడు ఉత్తరీయం మేకుకు తగిలి చినిగింది. అసలే పాతబడ్డ ఉత్తరీయం, అందులో చినుగు, ఆ చినుగును కుట్టడానికి సూదీదారం తీసుకున్నాడు. సూదిలో దారం దూరుస్తున్నాడు; ఎంతసేపటికీ దూరడంలేదు.

మారువేషంలోవున్న భోజుడు ఆయనదగ్గరకు పోయాడు. "స్వామీ, చినుగుకుట్టుకోవడ మెందుకు? నావద్ద క్రొత్తశాలువ ఉన్నది. దీనిని స్వీకరించండి" అని తన వంటిమీది శాలువ ఆయనకివ్వబోయాడు.

మహాత్ముడు తలయెత్తి చూచాడు. "ఎవరు నాయనా నీవు? నాకు సహాయపడదలచావా?"

"అవును స్వామీ, ఈ క్రొత్త శాలువా మీరు పరిగ్రహించండి" అన్నాడు.

"నాయనా, నాకు మేలుచేయదలిస్తే ముందు నీశాలువ నీవుతీసుకో, చేతనైతే ఈ సూదిలో దారం గ్రుచ్చిఇవ్వు" అన్నాడు మహాత్ముడు.

భోజుడు విస్మయం చెందాడు. శాలువా తిరిగి తీసుకున్నాడు. ఆ మహాత్ముడు ఇలా అన్నాడు :

"మిత్రమా, నీ శాలువా స్వీకరించనందుకు వన్నపార్థం చేసుకోవద్దు. ఎన్నడూ వ్యక్తి పరుల దయాదాక్షిణ్యాలమీద ఆధారపడకూడదు. తాను చేసుకోనగలపనికై పరులను ఆశ్ర

యించకూడదు. స్వశక్తిమీద ఆధారపడటం అనేది రాజు మొదలు సామాన్యునివరకు ఎల్లరు అనుసరించవలసిన మూల సూత్రం."

భోజుడు ఆనందంతో మహాత్మునికి వందనంచేసి నవ్వుతూ సూదిలోదారం గ్రుచ్చి ఇచ్చాడు. పిదప గృహాభిముఖుడై వెళ్ళిపోయాడు.

"స్వశక్తి.... స్వావలంబన.... మహర్షి నాకిచ్చిన మంత్ర మిది" అనుకున్నాడు.

మరునాటినుండి ఆస్థానంలో ఉన్నతోద్యోగులందరికి ఆశ్చర్యం కొలిపేరీతితో భోజుడు నిర్ణయాలుచేస్తున్నాడు. ఆజ్ఞలు జారీచేస్తున్నాడు. ఏమిటి రహస్యం? అధికారుల సలహాలను కళ్ళుమూసుకొని పాటించడం మాని వేశాడు. ప్రతి విషయాన్ని తానే శ్రద్ధగా పరిశీలిస్తాడు; మంచి చెడ్డలు గ్రహిస్తాడు. ఆ పిదప నిర్ణయాలు చేస్తాడు. శత్రువులెవరో మిత్రులెవరో అర్థంచేసుకుంటున్నాడు. సమర్థవంతమైన పరిపాలన ప్రవేశపెట్టాడు.

**నీమీద నీవు ఆధారపడు, అపుడు నీకు అపజయం ఉండదు.**

**— శ్రీ యస్. ఆర్. కోటేశ్వరశర్మ, హైదరాబాదు**

---

ఒకపనిలో విఫలం కావడం నేరం కాదు, చిన్న ఆశయం పెట్టుకోవడం నేరం. — కార్లయిల్

ఎందరో మహనీయులు-3

# డాక్టర్ మోక్షగుండం విశ్వేశ్వరయ్య

కొన్ని సంవత్సరాల క్రిందట కొందరు భారతీయులు అమెరికాలో ఒక ఉక్కు కర్మాగారం దర్శించడానికి వెళ్ళారు. అక్కడవున్న అధికారి కర్మాగారంలో ఒక యంత్రాన్ని గురించి చెపుతూ "ఈ యంత్రం ఎలా పనిచేస్తుందో తెలుసుకోవలెనంటే 75 అడుగుల ఎత్తుగల అనిచ్చెన ఎక్కి చూడాలి" అన్నాడు.

అచటకువచ్చిన భారతీయులలో 85 సంవత్సరాల వృద్ధు లొకరున్నారు. ఆయన మాత్రం 4 అంతస్తుల భవనాన్ని దాటివ నిచ్చెనను గబగబా ఎక్కి యంత్రం పనిచేసే తీరు తెన్నులు పరిశీలిస్తున్నాడు. మిగతావారు ఆయనలోని శలాఘ్య తనాన్ని, ఆయనకుగల విజ్ఞాన తృష్ణను గాంచి ఆశ్చర్యపడ్డారు.

ఆయనవరో మైసూరు రాష్ట్ర సర్వతోముఖాభివృద్ధికి కారణభూతుడైన శ్రీ మోక్షగుండం విశ్వేశ్వరయ్య. 1861 సెప్టెంబరు 15 న కోలారు జిల్లాలోని చిక్కబల్లాపూర్ తాలూకా ముద్దేనహళ్లి గ్రామంలో జన్మించాడు. తండ్రి శ్రీనివాస శాస్త్రి. తల్లి వెంకచ్చమ్మ. దారిద్ర్యంలో జీవించిన కుటుంబం వారిది.

విశ్వేశ్వరయ్య కళాశాల చదువుకోసం బెంగుళూరు

వెళ్ళినపుడు చేతిలో పైసా లేదు. చిన్నపిల్లలకు ప్రైవేటు చెప్పి ఆడబ్బుతో ఉన్నత విద్యాభ్యాసం చేశాడు. 1883 లో ఇంజనీరింగు పట్టభద్రుడై ఎఫ్. సి. ఇ. డిగ్రీపొందాడు. యావద్భారతంలోనే గాక ఆనాటి బ్రిటిష్ సామ్రాజ్యంలో గూడ ఖ్యాతి చెందిన యింజనీరాయన.

అరేబియాలో ఏడెన్ నగరానికి మంచినీటి వసతి లేదు. బ్రిటిష్ ప్రభుత్వ కోరికపై విశ్వేశ్వరయ్య 60 మైళ్ళ దూరం నుండి వర్షపునీటిని ఏడెన్‌కు పంపులద్వారా సరఫరా చేయడానికి పథకం సిద్ధంచేసి అమలు పరచాడు.

హైదరాబాదులో ముస్సీనది 1908 లో వెల్లువలై పొంగి పట్టణాన్ని ముంచెత్తింది. నైజాంనవాబు కోరికపై విశ్వేశ్వరయ్య మూసీనదికి ఆనకట్ట కట్టించి వరదల ప్రమాదం నివారించాడు. హైదరాబాదులో మూసీనదీతీరంలో ఉద్యానవనాలు వేయించాడు.

మైసూరు సంస్థానంలో కృష్ణ రాజసాగర్ డామ్ నిర్మాణానికి, భద్రావతి ఉక్కు కర్మాగారానికి కారణభూతుడు శ్రీ విశ్వేశ్వరయ్య.

మనం వాడే మైసూరు శాండల్ సబ్బుల ఉత్పత్తికి మూల పురుషుడు ఆయనే. మైసూరు అడవులలో పరిమళం వెదజల్లే చందన వృక్షాలున్నాయి. అందుచేత మైసూరులో చందన తైలము, చందన సబ్బుల తయారీకి కారు కర్మా

గారాలు స్థాపించారు. అచటి సబ్బులు ప్రపంచంలో చాలా దేశాలకు ఎగుమతి అవుతున్నాయి.

1912లో మైసూరు మహారాజా వీరిని సంస్థానానికి దివానుగా నియమించారు. వీరికి సహాయంగా ముగ్గురు మంత్రులుండేవారు.

ఈయన దివాన్ కాగానే వీరిబంధువొకడు వచ్చి కలుసుకున్నాడు. అతడు మైసూరు ప్రభుత్వ ఉద్యోగంలో వున్నాడు. తనకు 50 రూపాయలు అదనంగా లభించే పైవుద్యోగం ఇప్పించమని అడిగాడు. "రూల్సుకు భిన్నంగా ప్రొమోషను ఇవ్వజాలనని" నిష్కర్షగా చెప్పారు విశ్వేశ్వరయ్య. ఐతే ఆబంధువుకు ఇబ్బందిలో వున్నపుడు తన జేబులోనుండి పైకం పంపేవారాయన.

ఆయన అనేకసార్లు జపాను, అమెరికా, స్వీడన్, ఇటలీ, జర్మనీ, ఫ్రాన్సులు సందర్శించారు. చూచిన వాటిలో క్రొత్త విషయాలుంటే వెంటనే పుస్తకంలో వ్రాసుకొని "ఈనూతన విజ్ఞానం ఇండియాకు ఎలా వినియోగిస్తుంది"? అని ఆలోచించేవారు.

ఆకాలంలో మైసూరు మహారాజా దర్బారు చేసినపుడు బ్రిటిష్ ఉన్నతాధికారులు ప్రత్యేకాహ్వానంపై వచ్చేవారు. వారు చాల గర్వంతో వ్యవహరించేవారు. ఒక బ్రిటిష్ ఆఫీసరు

మైసూరు దివానగు విశ్వేశ్వరయ్యకు లేఖ వ్రాస్తూ "దర్బారులో నాకు ఏర్పరచినకుర్చీ మరీ ఎత్తుగా వున్నది. కాళ్ళు నేలకు ఆనడంలేదు. కాళ్ళక్రింద మెత్తని ఎత్తయిన దిండ్లు అమర్చండి" అని కోరాడు. మరునాడు విశ్వేశ్వరయ్యా కుర్చీ కాళ్ళుకోయించి "మీ ఆసనము యొక్క కాళ్ళు తగ్గింపబడినవి. దిండ్లతో పని లేదు" అని జవాబు వ్రాశాడు!

ఆయన అన్ని పనులూ టైము ప్రకారం చేసేవాడు. దుస్తులు సుందరంగా ధరించేవాడు. పని నిర్విరామంగా చేసేవాడు.

"మన దేశంయొక్క దౌర్భాగ్యం సోమరితనం. దూరంగావుండి చూస్తే అందరూ పని చేస్తున్నట్లు కనబడతారు. దగ్గరకు పోయిచూస్తే ఒకడు మాత్రం పనిచేస్తుంటాడు. ఒకడు గోళ్ళు గిల్లుకుంటూ కూర్చుంటాడు. మరొకడు నడుం వాలుస్తాడు. ఇంకొకడు వీళ్ళకు కబుర్లుచెపుతాడు." అని వారు చాలాబాధపడుతూ అన్నారు. ఇదే మన ముఖ్యమైన లోపం.

ఆదివరలో మైసూరులోని పాఠశాలలు మద్రాసు విశ్వవిద్యాలయం క్రింద వుండేవి. శ్రీ విశ్వేశ్వరయ్యా బెంగుళూరు విశ్వవిద్యాలయం స్థాపించి, సంస్థానంలోని విద్యాలయాలన్నీ దాని క్రిందకు తెచ్చారు. ఆయన నవీన మైసూరు నిర్మాతగా పేరొందారు.

ఒకసారి వారిలా సందేశమిచ్చారు "గుర్తుంచుకోండి.

నీపని కేవలం రైలు ట్రాసింగును ఊడ్చడం మాత్రమే కావచ్చు. కాని ప్రపంచంలో మరెవరూ ఏరైలు ట్రాసింగునూ ఉంచలేనంత పరిశుభ్రంగా నీవు దాన్ని ఉంచగలగాలి. అది నీకర్తవ్యం"

"భారత రత్న" బిరుదుతో గౌరవంపొందిన డాక్టర్ మోక్షగుండం విశ్వేశ్వరయ్య తన 101 వ యేట దివంగతులైనారు.

— శ్రీ ఎల్. ఎస్. శేషగిరిరావు,
బెంగుళూరు.

---

చిన్నకథలో పెద్దగుణపాఠం-2

## సహజ గుణం

ఒక సన్యాసి నదిలో స్నానంచేస్తున్నాడు. తేలొకటి నదిలో కొట్టుకు పోతున్నది. సన్యాసి దానివంక చూచాడు.

దాన్ని రక్షింపదలచి చేతులోకి తీసుకొన్నాడు. వెంటనే అది అతన్ని కుట్టింది. కంగారుతో అతడు దాన్ని నీటిలో వదిలాడు.

అయ్యో చచ్చిపోతున్నదే అనిపించింది. మరల దాన్ని రక్షించాలని బుద్ధిపుట్టింది. చేతిలోకి తీసుకున్నాడు మళ్ళీ అది అతన్ని కుట్టింది. తిరిగిదాన్ని నీటిలోవదిలాడు.

ఎలాగైనా దాన్ని రక్షించాలనుకొని మూడవమారు చేతులోకి తీసుకొని విసిరి గట్టుమీదికి వేశాడు. అది జరజరా నేల మీదికి వెళ్ళిపోయింది.

ఇదంతా చూస్తున్న యువకుడొకడు అడిగాడు సన్యాసిని : "అయ్యా! అది విషజంతువని తెలుస్తూనేవుండె. అది మిమ్ము రెండుసార్లు కుట్టిందాయె. అయినా దాన్ని ఎందుకు రక్షించారు ?"

అందుకు సన్యాసి "ప్రాణాపాయస్థితిలో వున్నప్పటికీ కూడా తేలు తన స్వభావాన్ని వదలకుండా కుడుతున్నదే. అలాంటపుడు సన్యాసి అయిన నేను పరోపకారం చేయడం అనే నాస్వభావాన్ని ఎందుకు వదలుకోవాలి?" అని సమాధానమిచ్చాడు.

పరిస్థితుల ప్రభావంవలన, వత్తిడులవలన, ఇబ్బందులవలన వ్యక్తి తన సహజమైన సుగుణాలనుకోల్పోరాదని దీనిని బట్టి తెలుస్తున్నది.

---

జడప్రాయంగా ఉన్న
అమితజ్ఞానం కన్న
చైతన్య రూపంలో ఉన్న
పరిమిత జ్ఞానం మిన్న

— ఖలీల్ జిబ్రాన్

మాటా—మంతీ : 2

## ఆధునిక పౌరునికి ఉండదగిన లక్షణాలు

స్టాక్‌హోమ్ విశ్వవిద్యాలయంలో అంతర్జాతీయ ఆర్థిక శాస్త్ర విభాగానికి ప్రొఫెసర్‌గాను, పిదప - స్వీడిష్ మంత్రివర్గంలో వాణిజ్య శాఖా మంత్రిగాను, కొంతకాలం ఐక్యరాజ్య సమితి యూరోపా ఆర్థిక సంఘానికి కార్యదర్శిగాను పనిచేసిన డాక్టర్ గున్నర్ మిర్డాల్‌కు 1974 డిసెంబరులో ఆర్థిక శాస్త్రంలో నోబెల్ బహుమతి లభించింది. యావత్ప్రపంచంలో వివిధ దేశాలు ఎదుర్కొంటున్న క్లిష్టమైన ఆర్థిక సమస్యలను గురించి, పేదరికము నిరుద్యోగము లాంటి సమస్యలను గురించి డాక్టర్ మిర్డాల్ ఇచ్చిన అభిప్రాయాలకు దేశదేశాలలో ప్రాధాన్యం లభించింది.

ఆయన ఆగ్నేయ ఆసియా దేశాలలో దారిద్ర్యం ఎందుకు తిష్టవేసుకొనివున్నది అనేవిషయం గురించి పరిశోధన చేసి "'Asian Drama - An enquiry into poverty of Nations" అను మూడుభాగములుగల బృహద్గ్రంథం రచించాడు. అంతేగాక 1969లో వాషింగ్టన్‌లో జాన్ హాప్‌కిన్స్ విశ్వవిద్యాలయంవారి ఆహ్వానంపై "ప్రపంచానికి పేదరికం ఇస్తున్న సవాలు"ను గురించి కొన్ని విమర్శనాత్మకమైన

ఉపన్యాసాలిచ్చాడు. ఆ ఉపన్యాసాలు గ్రంథరూపంలో వచ్చాయి.

ఒక దేశంయొక్క ఆర్థికాభివృద్ధి ఆ దేశంలో ఉన్నటువంటి ఖనిజములు, నదులు అడవులు మొదలైన ప్రకృతి వనరులమీద మాత్రమే ఆధారపడదు. ఆ దేశంలోని ప్రజల మనస్తత్వం మీద, అలవాట్లమీద, అభిరుచులమీద గూడ అధికంగా ఆధారపడి వుంటుందని ఆయన పేర్కొన్నాడు. ఆయన తన పరిశోధనలలో ప్రజల స్వభావానికి మనస్తత్వానికి అత్యధిక ప్రాధాన్యమిచ్చాడు.

యూరోపియన్‌లు ఆసియాలో వలస రాజ్యాలను ఆక్రమించి పాలించేటపుడు ఇచటి ప్రజల స్వభావాన్ని గురించి ఇలా వ్యాఖ్యానించారట: "ఇచటి ప్రజలు క్రొత్తపుంతలు త్రొక్కడానికీ బాధ్యత మీద వేసుకోడానికీ ధైర్యం చెయ్యరు. నూతన సంస్థ నిర్మాణానికి సాహసించి ముందుకు రారు. కేవలం బ్రతుకు తెరువు మనస్తత్వం కలిగివుంటారు. మూఢ విశ్వాసాలతో, నిర్లక్ష్యంగా సోమరితనంతో కాలంగడుపుతారు."

("Europeans in colonial times typically described the "natives" of these countries as superstitious, lazy, careless, unenterprising, and merely survival-minded"— Asian Drama—page 62.)

మనకు కష్టం కలిగించే విమర్శ అయినప్పటికీ ఇందులో కొంత సత్యమున్నది. ఒక సంస్థయొక్క, ఒక పరిశ్రమయొక్క

నిర్వహణ బాధ్యతను మీద వేసుకోడానికి ఇష్టపడం. ఏవిదేశీయుడో వచ్చి నిర్వహిస్తే అతని క్రింద ఉద్యోగం మాత్రమే చేయడానికి సిద్ధమవుతాం.

అలాగే, కేవలం బ్రతికితే చాలునవే మనస్తత్వం శతాబ్దాల తరబడి మన బానిసత్వానికి కారణమైంది. బ్రతుకు తెరువుకోసం విదేశీయుల పక్షం వహించి మన దేశీయులే పనిచేశారు. అలాగాక, ఆత్మగౌరవంతో స్వశక్తితో జీవించాలనే అకాంక్షను మనం పెంపొందించుకోవాలి.

ఇకపోతే, డాక్టర్ మిర్దాల్ తన గ్రంథంలో (పుట61) ఈనాడు ఆధునిక వ్యక్తికి, ఆధునిక రాజ్యంలో పౌరునికి, నవీన కాలంలో ఎలాంటిగుణాలుండాలో సూచనప్రాయంగా చెప్పారు. ఆయన 13 లక్షణాలు వ్రాశారు. ఇవన్నీ వేటికవి అలవరచుకోవలసినవిగావనీ, ఇవి పరస్పర సంబంధం కలిగినవనీ వ్రాశాడు:

1. పని చేయడంలో కౌశల్యం (Efficiency).

2. అప్పుడప్పుడు ఉత్సాహం తెచ్చుకొని పనిచేయడం గాక ఆగకుండా చేపట్టినపని కొనసాగించడం, (Diligence).

3. క్రమపద్ధతిప్రకారం పనులు చేయడం (orderliness).

4. ఆలశ్యమనేది లేకుండా, సమయాన్ని పాటించడం (Punctuality).

5. ధనవ్యయంలో జాగరూకత వహించడం (Frugality).

6. కచ్చితమైన నిజాయితీతో వ్యవహరించడం. అందుమూలాన భవిష్యత్తులో లాభం కలుగుతుంది. ఆర్థిక సామాజిక సంబంధాలలో కౌశల్యం పొందడానికి నిజాయితీ దోహదకారి అవుతుంది. (Scrupulous honesty which pays in the long run and is a condition for raising efficiency in social and economic relations).

7. చేయబోయే కార్యములను గురించి నిర్ణయాలు చేసేముందు కరడుగట్టిన ఆచారాలకు, మతాప్రయోజనాలకు, పక్షపాతానికి, అంధవిశ్వాసాలకు, వ్యక్తిగత రాగద్వేషాలకు లోనుగాకుండా సహేతుకంగా ఆలోచించడం. తద్వారా పశ్చిమదేశాలలో చెప్పబడే ఆర్థికదృష్టిగల వ్యక్తిగా రూపొందడం.

(Rationality in decisions on action. Liberation from reliance on static customs, from superstitious beliefs and prejudices, approaching the rationally calculating "economic man" of Western liberal ideology).

8. మార్పులకు సంసిద్ధమవడం. అందుకై నూతన మార్గాలలో ప్రయోగాలు చేయడం; అందుకై ఆర్థిక సామాజిక విషయాలలో విస్తృతంగా భావన చేయడం.

(Preparedness for change,—for experimentation along new lines, and for moving around spatially, economically, socially)

9. మారుతున్న ప్రపంచంలో తలెత్తే నూతన అవకాశాలను వినియోగించుకోవడంలో మెలకువ, నేర్పు కలిగివుండడం. (alertness to opportunities as they arise in changing world).

10. సాహసముతో బాధ్యతానిర్వహణకు ముందుకు రావడం. (energetic enterprise).

11. చిత్తశుద్ధి మరియు స్వావలంబన (Integrity and self-reliance).

12. అనేక చేతులద్వారా పనిజరపడం, వ్యక్తిగతమైన అహంకారాలను స్వప్రయోజనాలను పరిమితం చేయక సామూహిక క్షేమంకొరకు వినియోగింప చేయడం; తద్వారా సమష్టి శ్రేయస్సు అనే బాధ్యతను స్వీకరించడం. (Co-operativeness.—not limiting but redirecting egoistic striving in a socially beneficial channel; acceptance of responsibility for the welfare of the community and the nation).

13. సుదూరభవిష్యత్తును దృష్టియందుంచుకొని వ్యవహరించడం. అందుకై తాత్కాలిక ప్రయోజనాన్ని వదలుకోడానికి సిద్ధపడడం; అనగా స్పెక్యులేషన్‌లో బదులు పరిశ్రమలో పెట్టుబడి పెట్టడానికి, వ్యాపారానికి బదులువస్తూత్పత్తికి, ప్రాధాన్యమివ్వడం.

(Willingness to take the long view - and to forego short-term profiteering; subordination of speculation

to investment and of commerce and finance to production).

డాక్టర్ మిర్దాల్ పేర్కొన్న సుగుణాలకు మనం ఎంత వరకు దగ్గరగావున్నాం? విద్యద్వారా శిక్షణద్వారా ఎంతవరకు వాటిని అలవరచుకుటున్నాం? అని ఆలోచించుకోవాలి.

---

స్వరాజ్యం గురించిన అవగాహన-4

## చిన్నవాడి చేతుల్లో పెద్దవాడి ఓటమి!

"వెయ్యిమంది ఒకపక్షం; వందమంది వ్యతిరేక పక్షం. రెండు పక్షాల నడుమ యుద్ధం జరిగితే ఎవరుగెలుస్తారు?" కళ్ళు మూసుకొని చెప్పవచ్చు వెయ్యిమంది గెలుస్తారని.

కాని భారతదేశ చరిత్రలో ఇందుకు భిన్నంగా జరిగింది. వందమందే వెయ్యిమందిమీద గెలిచారు. ఒకసారిగాదు రెండు సార్లుగాదు. వరుసగా అనేకసార్లు ఇలాజరిగింది.

మొగలాయిలు, ఫ్రెంచివారు, ఆంగ్లేయులు, కొద్ది సైన్యంతో ఇచటికి వచ్చి తమకంటె పదిరెట్లు పెద్దసైన్యం గల స్వదేశ రాజులను నవాబులను చిందర వందర జేసి ఓడించారు. తమ ఆధిపత్యాన్ని స్థాపించారు. ఇంతటి విచిత్రం ఎలా జరిగింది?

రవి అస్తమించని సామ్రాజ్యాన్ని బ్రిటిష్‌వారు ఎలా స్థాపించుకున్నారు?

మొదట భారతదేశాన్ని జయించి ఇచటి ధనంతో, ఇచటి మానవ బలంతో బర్మామలయా మొదలైన మిగతా దేశాలను జయించి సామ్రాజ్యాన్ని విస్తరించుకొన్నారు.

మొదట భారత దేశాన్ని ఎలాజయించగలిగారు?

ప్రప్రథమంగా బెంగాలును జయించి, ఆరోజుల్లో బెంగాలు చాలధనవంతమైన రాష్ట్రంగనుక, బెంగాలులో కొల్లగొట్టిన ధనంతో మిగతా భారత దేశాన్ని పాదాక్రాంతం చేసుకొన్నారు.

బెంగాలును ఎలాజయించారు ?

బెంగాలును రక్తపుబొట్టు కార్చకుండా జయించారు! ఎందువల్లనంటే, 1757 లో జరిగిన ప్లాసీ యుద్ధంలో బెంగాల్ నవాబగు సిరాజుద్దౌలాయొక్క స్వంతమేనమామ, సర్వసైన్యాధిపతి యైన మీర్జాఫరు లోపాయికారిగా బ్రిటిష్‌వారితో లాలూచి అయినాడు. ఆంగ్లేయులు గెలిస్తే తనను నవాబు చేస్తారనే షరతుమీద శత్రువుల పక్షం తిరిగాడు. క్లైవు సైన్యం 3,000 మాత్రమే. నవాబు సైన్యం 50,000. ఐనప్పటికీ మీర్జాఫర్ యుద్ధమే చేయకుండా లొంగిపోయినందున క్లైవు ఫిరంగి పేల్చకుండా గెలువగలిగాడు.

ఇవే సంఘటనలు పేర్లమార్పులతో మిగతా రాష్ట్రాలలో

కూడ జరిగాయి. మహారాష్ట్ర కూటమి నాయకుడైన పీష్వా రఘునాధరావే ఆంగ్లేయుల పక్షం తిరిగి తన దేశీయుల మీద యుద్ధంచేయవలసిందిగా బొంబాయిలోని బ్రిటిష్ గవర్నరును ఆహ్వానించాడు. అది మొదటి మహారాష్ట్ర యుద్ధానికి దారి తీసింది.

"వెయ్యి మందికీ ఆయుధాలున్నాయి; వందమందికీ ఆయుధాలున్నాయి. ఇరుపక్షాలవారూ బల పరాక్రమాలుగల వారే. వందమందిగల ముఠా ఆయుధ పాణులై ఒకే దిక్కులో అడుగు వేస్తున్నారు. వెయ్యిమందిగలముఠా ఆయుధాలతో పరస్పరం పొడుచుకుంటూ వేర్వేరు దిక్కుల్లో అడుగు వేస్తున్నారు. అపుడు గెలుపెవరిది?" సులువుగా చెప్పవచ్చు వంద మంది జయిస్తారని. భారతదేశంలో జరిగిందిదే!

స్వరాజ్యం వచ్చినప్పటికీ మనస్వభావంలో రావలసిన మార్పు రాలేదు. మనశక్తిసామర్థ్యాలు, సిరిసంపదలు, తెలివి తేటలు, ఏకోన్ముఖంగా వినియోగం కావడంలేదు. అవి దేశ శ్రేయస్సు అనేటి ఒక గమ్యస్థానం కొరకు పనిచేయడంలేదు. పరస్పర వ్యతిరేక మైన రీతిలో పనిచేస్తుంటాయి. అందుచేత మన సామర్థ్యాలు ఒకదానినొకటి రద్దు (Nullify) చేసుకుంటున్నాయి.

గమ్యస్థానం, దేశశ్రేయస్సను గమ్యస్థానం, కోటానుకోట్ల భారత ప్రజల మనస్సులలో ప్రవేశ పెట్టవలసిన అవసరం అత్యధికంగా వున్నది.

---

## చిరునవ్వుతో కార్యసా

"ఏడుస్తూ వ్యవసాయం చేస్తే కాడీ మోకులూ ద
లెత్తుకెళ్ళారు" అని ఒక సామెత.

వ్యవసాయంమీద ఇష్టంలేనివాడిని పొలంసాగు
బ్రతకమన్నారు. వాడు అయిష్టంగా విచారంతో
దున్నుతూ వ్యవసాయ మారంభించాడు. మనస్సులో
లేదు కాబట్టి నిర్లక్ష్యంతో ఎక్కడి వస్తువులక్కడ వ
పోయేవాడు. వీడి ఏమరుపాటుతనం చూచి ఎద్దులను
కాడి, తాళ్ళూ దొంగలెత్తుకు పోయారు!

అశ్రద్ధగా చేసే పనులు ఇలాగే విఫలమవుతాయి. నవ్వు
సంతోషంతో చేసే పనులు సానుకూల మవుతాయి.

కొంతమంది ఎప్పుడూ చిరునవ్వుతో కనిపిస్తారు.
ఏపని చేసినా అగ్గిపుల్ల తుంచినంత తేలికగా జరుగుతా
చిరునవ్వులో విజయం తొంగిచూస్తూవుంటుంది.

"నవ్వు నాలుగందాల చేటు" అని సామెతవు
అది ఎవరినో చూచి నవ్వినపుడు, హేళనగా నవ్వినపుడు
రగా నవ్వినపుడు వర్తిస్తుంది. చిరునవ్వు విషయం అలా
కాదు, సంతోషాన్ని, ఉల్లాసాన్ని చిరునవ్వు తెలియజే

చిరునవ్వుతో క్రొత్త వారిని స్వీకరించడం, చిర
పలకరించడం అలవరచుకోవచ్చు. మనస్సులో ఎ
ఉన్నా దిగమ్రింగి, చేసే ప్రతిపనీ తనకిష్టమైనదిగా
ఉంటే సంతోషం కలుగుతుంది. సంతోషంవల్ల
తొంగిచూస్తుంది. ఆచిరునవ్వే విజయానికి సోపానవ

నవ్వుతూ పనిచేయగలవాడు గొప్పవాడు;
కష్టాలనెదుర్కోగలవాడు మరింత గొప్పవాడు.

"నేనొకప్పుడు దక్షిణ సముద్ర ద్వీపాలలో తె
చిక్కుకున్న నౌకల గురించిన ఒక సంఘటన
చదివాను. ఆనౌకల చిత్రాలను సచిత్ర లండన్ ప
కలో ప్రచురించారు.

ఒక ఆంగ్ల నౌక తప్ప తక్కినవన్నీ శిథిలమై ఆ
ఆబొమ్మలో - మునిగిపోతున్న నౌకలలోని వ్యక్తు
నౌకలలోవుండే తుఫానునుండి తప్పించుకొని
వాళ్ళను సాగనంపుతున్నారు!

అటువంటి ధైర్యమూ ఔదార్యమూ మనం
కోవాలి" అని స్వామి వివేకానంద ఒక చోట వ్రా

మునిగిపోతున్న నౌకలలోవుండి ఇంకా కొద్ది
మరణించ బోతున్నవారు నవ్వుతూ ఇతరులకు
చెపుతున్నారు!

వాళ్ళు నవ్వుతూ చచ్చిపోయారు. అలాంటప్పుడు మనం అనుదిన జీవితంలో విసుగుపుట్టే పనులుగాని, ఎదురొ్కనే ఇబ్బందులుగాని నవ్వుతూ స్వీకరించలేమా? అది కార్య సాధనకు తోడ్పడుతుంది.

---

మాటా-మంతీ-3

## దానంచేయడం కంటె పని నేర్పడం మంచిది!

"చిన్ని నాబొజ్జకు శ్రీరామరక్ష" అన్నట్లు తనకడుపు నిండితే చాలుననుకోక, ఇతరుల కడుపు నిండడానికై సహాయ పడమని మనవాళ్ళు చెప్పారు.

మరొకప్రాణి యొక్క దుఃఖాన్ని తొలగించడం ఒక మహత్కార్యంగా పరిగణించమన్నారు. కారుణ్యము సాను భూతి అనేవి లేనివాడు మానవుడుకాడు దానవుడే నన్నారు.

"కాంగ తనముతో తనకడుపుమాత్రమే నింపు కొన్నట్లు మనష్యుడు జీవించరాదు. తనవలన అనేకులు బ్రతుకుచున్న మనిషి జీవనమే జీవనము" అని ఒక కవి వ్రాశాడు.

"కూడబెట్టులే స్వభావముగాగల సముద్రుడు అట్టను

గునే వుంటాడు. దానగుణముగల మేఘుడు ఉన్న తాకాశమున ళీవిగా గర్జిస్తూవుంటాడు" అని మరొక కవి వ్రాశాడు.

ఇతరుల కష్టాలయెడ సానుభూతి కలిగియుండి ఆకష్టాల నెదుర్కోవడంలో వారికి చేయూత నివ్వడానికై నీకున్న దానిలో కొంత దానం చేయునలసినదిగా బోధించారు. దానం చేసినట్లయితే పుణ్యం కలుగుతుందనీ, జీవితం సఫలమవుతుం దనీ చెప్పారు.

ఇవన్నీ శిరసావహించ దగిన నీతులే. మానవుణ్ణి పశువు నుండి దూరంచేసేది సానుభూతి, కారుణ్యములాంటి గుణ ములు. వాటిని అలవరచుకొనేమార్గం దాతృత్వం కలిగి యుండడం.

ఐతే, మరొక విషయంగూడ ఆలోచించాలి. దానం స్వీకరించే యాచకుడు ఎలాతయారవుతాడు? అతడు స్వశక్తితో జీవించక పరులమీద ఆధారపడుతూ స్వాభిమానం కోల్పోతాడు.

అతనిలో దైన్యము తాండవిస్తూవుంటుంది. తాను అందరికంటె అల్పుడననే భావన (Inferiority complex) ఏర్పడుతుంది. అతన్ని అందరూ చీదరించుకుంటారు.

"తేలికగల పదార్థములలో గడ్డిపోచ తేలిక, దాని కన్నను దూది తేలిక, దానికన్నను యాచకుడు తేలిక" అని చాణుక్యుడు పేర్కొన్నాడు.

# భోజరాజుకు చిక్కు సమస్య

తనపని మరొకరెవరైనా చేసిపెడితే ఎంత బాగుండునా అని పిస్తుంది !

తాను శ్రమపడకూడదు. తనకోరకు మరొకరు శ్రమించి పనిచేసిపెట్టాలి — అని పలువురి కోరిక.

కొందరు విద్యార్థులు తమ సైన్సురికార్డును మరొకరిచేత వ్రాయించుకుంటారు; తమకిచ్చిన ఇంటిపని అన్నయ్యచేతనో అక్కయ్యచేతనో చేయించుకుంటారు. తాము చేయవలసిన లెక్కలు మరొకరిచేత చేయిస్తారు. ఇందువల్ల తమకు లాభం కలిగినట్లు కనిపించినా అది నిజంగా మేలుచేకూర్చదు. ఆ విజ్ఞానం తమకు చెందదు — పనిచేసినవానికి చెందుతుంది.

పరులమీద ఆధారపడి పనులు జరిపించుకోవడంలోని సాధకబాధకాలను తెలిపేగాధ ఒకటున్నది.

అది 1020 వ సంవత్సరం. ధారానగరంలో భోజరాజు అప్పుడే సింహాసన మధిష్ఠించాడు. ఆనాటినుండి అతనికొక చిక్కుసమస్య ఎదురైంది. సుదీర్ఘమైన ఆలోచనలోపడ్డాడు.

"నాకంటె ముందు రాజ్యంచేసిన మా పెదతండ్రి ఎంతో కీర్తి సంపాదించాడు; సమర్థుడని పేరుపొందాడు. రాజ్యం

సుభిక్షంగా నడిచింది. మరి నేనో?.... పనిపాలనానుభవం లేనివాడను.... ఎవరిసలహా తీసుకోవచ్చునో తెలియకుండా వున్నది.... నేను ఆధారపడుతున్న వాళ్ళు నమ్మకస్తులో కాదో.... వారు నాకు మిత్రులో కాదో.... ప్రజలకు నేను మంచిప్రభుత్వాన్ని ఎలా ఇవ్వగలను?" అనుకుంటూ దూరంగావున్న కొండశిఖరం వంక చూస్తున్నాడు. ఎటూ పాలుపోవడంలేదు.

ఇలా ఆలోచిస్తుంటే రోజులు గడిచిపోతున్నాయి. ఒకనాడు కిటికీగుండా వెలుపలికిచూచాడు. వీధిలో స్త్రీలు పురుషులు గుంపులు గుంపులుగా నడిచిపోతున్నారు. ఎక్కడికో తెలుసుకోమన్నాడు పరిచారకుణ్ణి.

ఊరి వెలుపల ఎవరో మహాత్ముడు వచ్చివున్నాడట. అనేక పుణ్యస్థలాలు దర్శించి వచ్చాడట. ఆయన ప్రసంగం వినడానికి జనం పోతున్నారు.

తన సందేహంగూడ తీరుస్తాడేమోనని భోజరాజుకు ఆశకలిగింది. మారువేషం వేసుకొని ఆ జనంతోబాటు తానుగూడ వెళ్ళాడు. అందరితోబాటు తనుగూడ మహాత్ముని ప్రసంగం విన్నాడు. ఆఖరుకు తన సందేహం తీర్చుకోదలిచాడు.

ప్రజలంతా ఒక్కొక్కరే వెళ్ళిపోయారు. ఇతడుమాత్రం అక్కడే ఆగిపోయాడు. అప్పుడే చీకటిపడుతున్నది. నిదానంగా మహాత్ముణ్ణి సమీపించాడు.

అతని యాచనే అతన్ని అల్పుడిగా చేస్తుంది. ఎందుకంటే, ఇచ్చేవాడి చెయ్యి పైనవుంటుంది; తీసుకొనే వాడి చెయ్యి క్రింద వుంటుంది. బలిచక్రవర్తిని యాచింప బోయినపుడు విష్ణుమూర్తి అంతటివాడు వామనుడు కావలసివచ్చింది!

దేశంలో కొందరు ప్రజలు యాచనను వృత్తిగా స్వీకరించడం దేశానికి అవమానకరం. దానమనే మంచిగుణం దేశంలో దుర్వినియోగమవుతున్నది. దృఢ శరీరులైన లక్షల కొలది స్త్రీ పురుషులు దేశంలో యాచకులుగా తయారవడం జాతికి కళంకంగా వుండిపోతున్నది.

మరి, దానంచేయడం చెడ్డగుణమా? ప్రజలను దానాలు చేయడాన్ని కట్టిపెట్టవలసిందిగా ఆదేశించడమవసరమా? అనే సంశయం కలుగవచ్చు.

నీవు కారుణ్యము సానుభూతి తప్పక అలవరచుకోవాలి. అందులో సందేహంలేదు. వాటిఫలితంగా బలహీనులకు నిరుపేదలకు వారి కాళ్ళమీద వారు నిలబడి జీవించడానికి సహాయం చెయ్యి. అంతేగాని వాళ్ళను పరభాగ్యోప జీవులుగా తయారు చేయకు.

ఇది ఎలా సాధ్యం? దీనికి మార్గమేమిటి? క్రీస్తు పూర్వం 4వ శతాబ్దానికి చెందిన చైనా మేధావి క్వాన్ ఇజా అనునతడు రమణీయమైన రీతిలో ఇలా చెప్పాడు :

"If you give a man a fish,
he will eat once.

If you teach a man to fish,
he will eat for the rest of his life".

ఒకడికి నీవొక చేపను కనుక ఇస్తే, వాడు దాన్ని ఒక్కమారు భుజిస్తాడు. అతడికి నీవు చేపలు పట్టడంగనుక బోధిస్తే, అతడు జీవితాంతము భుజించగలడు - అని అన్నాడాయన.

ఆ చైనాపండితునిమాట ఒక వరాలమూట. దేశంలో ప్రజలకు యాచించడం నేర్పకూడదు; జీవించడం నేర్పాలి. పరులపై ఆధారపడడం నేర్పకూడదు, తమకాళ్ళపై నిలబడడం నేర్పాలి.

చేపను దానంచేయడం వల్ల అతనికి ఒక రోజు కడుపు నింపగలవు; చేపలు పట్టడం నేర్పడంవల్ల అతనికి అన్ని రోజులూ కడుపు నింపగలవు!

---

వ్యష్టిలోనుండి సమష్టిలోనికి
"స్వం"లో నుండి "సోహం" లోనికి
పరిణమించడం జీవితం
కాక మరేమిటి దీనికర్థం ?

— శ్రీ పురాణపండ రంగనాథ్

## జపాను మహిళ

---

ఒక పంజాబీ పెద్దమనిషి జపాన్ దేశంలో పర్యటిస్తున్నాడు. ఆయన టోకియోనగరం నుండి కియోటోనగరానికి రైలులో ప్రయాణిస్తున్నాడు.

ఆయన ఎరిగివున్న జపాన్ మహిళ ఒకరు అదే పెట్టెలో ప్రయాణంచేస్తున్నది. ఆమెవద్ద పాతబడి మాసిపోయిన గుడ్డలు కొన్ని ఉన్నాయి. వాటి నామె ఇస్త్రీచేసిన అందమైన సిల్కు తువ్వాలులో చుట్టి ముడి వేసింది.

ఆ భారతీయ ప్రముఖుడామెను "క్షమించండి. నాకు తెలియక అడుగుతున్నాను. పనికిరాని గుడ్డలను ఇంత చక్కని తువ్వాలులో దాచవలసిన అగత్యమేమిటి? అంత సుందరమైన సిల్కు వస్త్రమును ఇందుకై ఎందుకు వినియోగిస్తున్నారు?" అని ప్రశ్నించాడు.

అందుకామె "అయ్యా! ఇతరుల కంటికి మురికి దృశ్యము చూడనిచ్చే హక్కు నాకేమి వున్నది? మానవ జీవితంలో ఎంతో మురికి, కశ్మలము ఉండనే వున్నది. నేను మరికొంత జోడించుట తగదుకదా!" అని అన్నది.

వాస్తవానికి మన ఎదుట ఎంతో మాలిన్యమున్నది.

మనుష్యులు తిని పారవేసిన తొక్కలు, చెత్త చెదారము లతో వీధులు నిండిపోతున్నాయి.

దీనికి పేదరికం కారణంకాదు. జీవితంమీద నిర్లక్ష్యం, అశ్రద్ధ ఇందుకు హేతువులు. మనదేశానికి వచ్చేవిదేశీయులకు మన మీద ఏహ్యభావం కలగడానికి సర్వత్రా కనిపించే మాలిన్యం కారణమవుతున్నది.

పరిసరాలు అందంగా శుభ్రంగా ఉంచుకొంటే మనస్సులు ఉల్లాసంగా ఉంటాయి. ఆ జపాను మహిళ చేసినపని మనకొక హెచ్చరికగా స్వీకరించవచ్చు!

---

స్వరాజ్యం గురించిన అవగాహన-5

## దేశంయొక్క అసలు సమస్య

మామిడితోట పూతపూసి కాపుకొచ్చినపుడు తోటమాలి ముఖంలో చిరునవ్వు చిందునట్లు, పెరిగి పెద్దవాడైన కుమారునికి ఉద్యోగంవచ్చి పొరుగూరు పోతుంటే తండ్రిహృదయమానందంతో ఉప్పొంగునట్లు 27 సంవత్సరాల స్వాతంత్ర్యం అనుభవించిన పిదప దేశప్రజల్లో ఆత్మవిశ్వాసం తొంగిచూడాలి; సంతోషం వెల్లివిరియాలి. కాని పరిస్థితి అలా లేదు.

మనలను మనమే ద్వేషించుకుంటున్నాం. మనకు మనమే అపకారం చేసుకుంటున్నాం. దేశంలో అలజడులు అలవాటైపోయాయి. సమ్మెలు సాధారణమైనాయి. డబ్బుపెట్టి దేనినైనా పొందవచ్చుననే స్థితి ఏర్పడుతున్నది.

ఆమధ్య కలకత్తా వద్దగల బెడియాపారా అనే గ్రామంలో దాదాపు అందరికీ పక్షవాతం వచ్చి మంచాన పడ్డారు. అందుకు కారణం పరిశీలించగా, ఆవూరి జనులు తినిన ఆహార పదార్థాలలో ఉపయోగించబడిన ఆవనూనెలో కల్తీ కలిసిందట. కలకత్తాలోని ఒకప్లాస్టిక్ కర్మాగారం నుండి వెలువడిన పనికిరాని మలిన ద్రవాన్ని ఆవనూనెలో కల్తీకలిపారట! కొలదిమందియొక్క అక్రమ ధనార్జన కొరకు వూరిలోని వారంతా పక్షవాతానికి గురియైనారని 1978 జనవరి 28 తేదీ "ఇలస్ట్రేటెడ్ వీక్లీ" పేర్కొన్నది.

అలాగే, రాజస్థాన్‌లో కిలోమీటరు రోడ్డు వేయడానికి 13,000 రూపాయలు సాధారణంగా ఖర్చుకావలసియుండగా, సగటున 59,000 రూపాయలతో కిలోమీటరు రోడ్డు వేస్తున్నారని ఆరాష్ట్రంయొక్క పబ్లిక్ అక్కౌంట్స్ కమిటీ 11వ నివేదికలో పేర్కొన బడిందని 1971 జులై నెల "మదర్ ఇండియా" వ్రాసింది. కావలసిన దాని కంటె $4\frac{1}{2}$ రెట్లు ఎక్కువ వ్యయం! ఇందుకు కారణం లేనిమనుష్యుల పేర్లతో డబ్బుఖర్చుయినట్లు చూపడమేనని కమిటీ అభిప్రాయ పడింది.

దేశంలో సగటు వ్యక్తి యొక్క నైతికస్థాయి ఇలా దిగజారిపోతే దేశభవిష్యత్తు ఆందోళన కలిగిస్తుంది. జాతియొక్క రక్తంలోనే ఏదైనా దోషం వున్నదా అనేసంగతి ఆలోచించాలి; ఆత్మ విమర్శచేసుకోవాలి. మన ఆలోచనల్లోనే అంతర్లీనంగా ఏదైనా లోపంవున్నదా అని పరిశీలించుకోవలసియున్నది. అసలుమనం ఎవరికొరకు జీవిస్తున్నాం? మన జీవిత లక్ష్యమేమిటి? అనే మౌలికమైన సంగతులను చర్చించ వలసి వున్నది.

ఎవరి కొరకు జీవిస్తున్నాం?

మనిషి అంటే మనస్సే మనస్సంటే ఆలోచనలే. ఆలోచనల యొక్క ఫలితములే చర్యలు. మనచర్యల యొక్క పరిణామములే రోజూ చూస్తూవుంటాం.

దేశం వుండవలసిన విధంగా లేదంటే అర్థం మనచర్యల యొక్క ఫలితాలు బాగుగాలేవు. దానికి కారణం మన ఆలోచనలు సవ్యంగాలేవు. అవి దోషములతో గూడి వున్నాయన్నమాట! అవి ఎలావున్నాయి? ఎలాలేవు?

వ్యక్తి చేసే ప్రతిపనికీ ఒక గమ్యస్థానం వుంటుంది. వూరికే అకారణంగా మనిషి వీధుల్లో తిరగడు. చదవడం కొరకు బడికిపోతాడు; వస్తువు కొనడం కొరకు బజారుకు పోతాడు; ఆడుకోడానికై క్లబ్బుకు పోతాడు.

ఇలా గంట, అరగంట పనులకే ఒక గమ్యస్థాన మున్నపుడు, 80 లేక 90 ఏండ్లపాటు కొనసాగే వ్యక్తియొక్క జీవితమంతటికీ ఒకగమ్యస్థానముంటుంది; ఒకసూత్ర ముంటుంది; ఒక అంతర్లీనమైన దారముంటుంది. ఆజీవన సూత్రమేమిటి?

"నేను ఎవరికొరకు జీవిస్తున్నాను? ఎందుకు జీవిస్తున్నాను?" అనే ప్రశ్నకు ప్రతియొక్కరూ జవాబు నిర్ణయించుకోవడంలోనే దేశంయొక్క అనేకసమస్యలు ముడిపడి వున్నాయి.

దోవనపోయే పెద్దమనిషి నడిగితే :

దేశాన్ని కలవరపెడుతున్న మౌలికమైన దోషాలను అర్థంచేసుకోవడానికై, వాటిని స్పష్టంగా అర్థం చేసుకోడానికై కొన్ని చిన్న చిన్న ఉదాహరణలను తీసుకుందాం.

వీధిలోపోతున్న పెద్దమనిషిని ఇంట్లోకి ఆహ్వానించి కూర్చోబెట్టి "మాకొకసందేహంవచ్చింది. మీరు దాన్ని తీర్చాలి ........వ్యక్తి ఎవరికొరకు జీవిస్తాడు? మీరు ఎవరికొరకు జీవిస్తున్నారు? మీజీవితగమ్యస్థానమేమిటి?" అని అడిగితే చిరునవ్వు నవ్వుతాడు.

"ఇంత స్వల్పవిషయానికి అంత కంగారేమిటి?.... నేను నాకొరకే జీవిస్తున్నాను.... నేనేగాదు, ఎవరైనాఅంతే నా కొరకే అన్నం తింటున్నాను; నీరు త్రాగుతున్నాను; గాలి పీలుస్తున్నాను'' అంటాడు.

"మంచిది.... మీరు ఒకరోజులో చేసేపనులన్నీ జాబితా వ్రాస్తారా?" అని కలం కాగితం చేతికిద్దాం.

"నిద్రలేచాను; స్నానంచేశాను; భోజనంచేశాను; ఆఫీసుకు వెళ్ళాను...."ఇలా వ్రాస్తూపోతాడు. వీటన్నిటికీ చివర "ఎవరికోసం?" అనే ప్రశ్న చేర్చండి. తనకోసమేనని సమాధానం వస్తుంది.

"సాయంకాలం ఇంటికిపోతూ వెంకటగిరిచీర కొన్నాను; బజారులో గాజులుకొన్నాను" అని వ్రాశాడు. ఎవరికోసం? తనకోసంకాదు! తన భార్యకోసం, కుమార్తెకోసం. ఎవరువీళ్ళు? తన "కుటుంబం".

అతడు మొదట చెప్పినట్లు తనకోసం మాత్రమే జీవించడంలేదు, సమాధానంలో సవరణచేర్చవలసివచ్చింది. తన కుటుంబంకోసంగూడ అనేకపనులు చేస్తున్నాడు. అందుచేత ఇకనుండి "తాను, తనకుటుంబం" ఈ రెండూ అతని గమ్యస్థానాలు.

వీటిలో ఏది ఎక్కువ ముఖ్యం ? ఒక విధంగా చూస్తే తానే ముఖ్యం. తన చెయ్యివిరిగితే తాను కట్టుకట్టించుకోవాలి గాని భార్య కట్టించుకోదుగదా! ఆకలివేస్తే తాను తినాలి గాని కొడుకుతింటే తనకడుపు నిండదుగదా !

## "నేను" నుండి "మనము"లోనికి ప్రయాణం :

"ఇద్దరు మనుష్యులు ఒకే మంచంలో నిద్రించవచ్చుగాని కలలు వేర్వేరుగా కంటా"రని చైనా దేశంలో సామెత. అలాగే ఎవరి శరీరఅవసరాలు వారివి. తనకు వ్యాధివస్తే తానే అనుభవించాలి. కనుక వ్యక్తి ప్రధానంగా తన సుఖమే చూచు కుంటాడు.

కాని ఇందులో ఒక పేచీవున్నది. వ్యక్తి తానొక్కడే సుఖపడలేడు. నీటిలో వేసిన నూనెబొట్టువలె ఏకాకిగా జీవించలేడు. తన సుఖానికి ఇతరుల జీవితాలకూ లంకె వున్నది.

భూమిమీద పడగానే తల్లిపాలు కావాలి; ఎవరు లేకుండా తాను లేడో ఆ మాతాపితరుల అండదండలుండాలి. సుస్తీ చేస్తే ఆదుకొనే వారుకావాలి. వ్యక్తి "నేను" నుండి "మనము" లోనికి చేసేప్రయాణమే మానవజీవితం. అందు మొదటి మజిలీ కుటుంబం.

## ఎవరికంటె ఎవరుమిన్న?

"ఏమండీ, రాష్ట్రపతి విజయవాడ వస్తున్నారట. రేపు సెలవుపెట్టి వెళ్ళి వారి ఉపన్యాసం విందామా" అంటే, "నాకు సెలవలై పోయినయ్. జీతం నష్టమవుతుంది. రానం" టాడు.

అదే పెద్దమనిషి వారం గడవకముందే నాలుగురోజులు జీతం నష్టంమీద సెలవు పెడతాడు. అదేమంటే భార్యను ఆసుపత్రిలో చేర్చాను. దగ్గరుండాలంటాడు.

పండగనాడు తనకిష్టమైన కూరలూ పిండివంటలూ చేయించుకొని తీరిగ్గా తినాలని విస్తరి ముందుకూర్చొని ముద్ద నోట్లో పెట్టుకోబోతుండగా, పెద్దకొడుకు లారీకింద పడ్డాడని కబురొచ్చింది. అన్నం వదిలేసి వెళ్ళిపోయాడు. ఏం! అతనికి ఆకలిలేదా?

తనకు సుఖంకావాలి. కాని అది కుటుంబ సుఖానికి లోంగి వుంటుంది. తాను ప్రేమించే వాళ్ళు దుఃఖపడుతూవుంటే తాను సుఖంగా వుండలేడు.

ఏపనిచేసినా అది తనకు లాభదాయకమా అని మొదట ఆలోచిస్తాడు; తన కుటుంబానికి లాభదాయకమా అని తర్వాత ఆలోచిస్తాడు. ఈ రెండు ఆలోచనలే మనుష్యులను నడిపిస్తున్నాయి.

మనదేశంలో వ్యక్తుల ఆలోచనలన్నీ ఇంతటితో ముగుస్తున్నాయి.

రెండవ నవరణ :

అదొక పల్లెటూరు. పంట ఇంటికి వచ్చిన పిదప రైతుల చేతుల్లో డబ్బు మసలుతున్నది. మార్చినెల వచ్చింది. వూళ్ళో

దొంగలుపడటం ప్రారంభించారు. ఒకరింట్లో మెళ్ళల్లో గొలుసులు పోయినయ్; మరొకరింట్లో బిందెలు చెంబులు పోయినయ్.

మున్సబ్ గారింట్లో మీటింగు వేశారు. వూళ్ళో వున్న యువకులు వృద్ధులు అంతావచ్చారు. రాత్రిళ్ళు కాపలా కాయాలని తీర్మానించారు. బ్యాటరీలైట్లు చేతికర్రలు కొనటానికి మనిషిని పంపించారు. నలుగురు నలుగురు మనుషుల వంతున జట్లుచేసి రాత్రి యావత్తూ వీధుల్లో పహరాకాయాలని నిర్ణయించారు.

నూతనంగా వివాహమై భార్య కాపరానికొచ్చిన యువకుడొకడున్నాడు. అందరికళ్ళూ అతనిమీదికి పోయినయ్.

"ఏం; నువ్వుగూడ రావాలి" అన్నారు.

"మీరు అంతా వెళ్ళండి. నా విషయం తరవాతలే" అంటాడు. తప్పుకోవాలని చూస్తాడు.

"కాదు. నీ పేరేముందురాశాం. నీవు వచ్చితీరాలి. వూరంతా దొంగల బెడదతో అట్టుడికినట్లు వుడికిపోతుంటే, నీ వొక్కడివీ పెళ్లాంతో కులుకుతూ ఇంట్లోకూచుంటావా?" అని చురుకైన మాటలంటారు.

అతడెందుకు రావాలి?

"నేను నాకొరకే జీవిస్తున్నాను"—ఇదే జీవిత ధ్యేయమైతే రానక్కరలేదు. హాయిగా నిద్రపోవచ్చు.

"నేను నా కుటుంబం కొరకుగూడ జీవిస్తున్నాను"—అని భావించినప్పటికీ రానవసరం లేదు. తన భార్యతో పాటు ఇంట్లోనే వుండవచ్చు.

"ఊరందరికీ ఒక విపత్తు వచ్చినపుడు నా యింటికిగూడ ప్రమాదం వచ్చినట్లే. ఊరు క్షేమంగా వుంటేనే నాఇల్లు క్షేమంగా వుంటుంది. కనుక నేను వెళ్ళితీరవలసిందే" అని అత డనుకుంటాడు.

ఎందుకు వెళ్ళాలి? ఏసూత్రం ప్రకారం అతను వెళ్ళాలి?

ఊరంటే సమాజం. అనేక లక్షల కుటుంబాల సముదాయమే సమాజం. సమాజానికి విపత్తు వచ్చినపుడు కుటుంబం సుఖంగావుండే వీలులేదు. అందుచేత "నేను సమాజం కొరకుగూడ జీవిస్తున్నాను" అని వ్యక్తి గ్రహిస్తాడు. ఇది జీవిత నియమావళికి రెండవ సవరణ.

ఈ అవగాహన లేకపోవడమే అన్నిసమస్యలకు మూలకారణం :

దేశంలో లక్షలకొలది ఉన్నతోద్యోగులున్నారు; శాసన కర్తలున్నారు; పారిశ్రామిక వేత్తలున్నారు; సైనికాధిపతులున్నారు; పత్రికారచయితలున్నారు; వ్యాపారస్థులున్నారు; విద్యావంతులున్నారు. కాని జీవించడ మెవరికోసం

అనే ప్రశ్నకు పలువురు మొదటి రెండు సమాధానాలతోనే ఆగిపోతున్నారు. మూడవ సమాధానం వారి మనస్సుల్లోకి రావడంలేదు. అలా రాకపోవడంవల్ల కలిగే దుష్ఫలితం ఎలాంటిదో పరిశీలిద్దాం.

ఢిల్లీలో ఒక సైనికాధికారితో ఒకవిదేశీయుడు స్నేహం చేస్తున్నాడనుకుందాం. ఒకనాడు విదేశీయుడు ఇతన్ని అడిగాడు: "మీావద్ద ఒక రహస్య సైనికసమాచారం వున్నది. దాన్ని మీారు నాకు తెలిపితే 10 లక్షల రూపాయలు మీాకిస్తాను."

ఆసైనికోద్యోగి శత్రువుకు ఆరహస్యం తెలుపవచ్చా? ప్రశ్నలు వేసుకోనండి :

"నేను నాకోరకే జీవిస్తున్నాను"— అనుకుంటే ఆపని చెయ్యవచ్చు! అతనికది అత్యంతలాభదాయకం. ఉద్యోగం మానుకొని అది పెట్టుకుతింటూ వుండవచ్చు హాయిగా.

"నేను కుటుంబం కొరకుగూడ జీవిస్తున్నాను"- అనుకుంటేగూడ ఆపనిచెయ్యవచ్చు! ఎందుకంటే కుటుంబంలోని వారికి ఆ డబ్బుతో చదువులు చెప్పించవచ్చు; విదేశాలకు వంపవచ్చు; ఇళ్ళు కట్టించి పెట్టవచ్చు.

"నేను సమాజంకొరకుకూడ జీవిస్తున్నాను"- అనుకున్నపుడు ఆపనిచెయ్యకూడదు! అందువల్ల దేశానికి ముప్పు

వాటిల్లుతుంది; ప్రజలకు విపత్తు ఏర్పడుతుంది; కనుక దేశ ద్రోహం తలపెట్ట కూడదు.

మూడవసూత్రం మనసులోలేదు !

కోటానుకోట్ల భారత ప్రజలలో, విద్యావంతులలో ఈ మూడవసూత్రం మనసులోలేదు. వాళ్ళు ఏపని చేసినా "ఇది నాకు లాభదాయకమా?" అని మొదటి ప్రశ్న వేసుకుంటారు. "ఇది నాకుటుంబానికి లాభదాయకమా?" అని రెండవ ప్రశ్న వేసుకుంటారు. అంతటితో ఆలోచన ముగుస్తుంది. పని చేసివేస్తారు.

"ఇది నా సమాజానికి లాభదాయకమా, నష్టదాయకమా? ఇది నా దేశానికి క్షేమకరమా విపత్కరమా" అనే ఆలోచన లేదు!

ఇదే దేశంయొక్క సమస్య. ఈసమస్యతోటే దేశంలో అనేక ఇతర సమస్యలు ముడిపడి-వున్నాయి!

కొలదిరూపాయలు లాభంరావడంకోసం ఆవనూనెలో కల్తీ కలిపినందువల్ల గ్రామంలోని యావన్మందీ పక్షవాతానికి గురియైనారు. ఎందువల్ల కల్తీ కలిపాడు? ఇది సమాజానికి లాభదాయకమా ప్రమాదకరమా అనేభావన అతనికి లేదు.

వేల కోట్ల రూపాయల ఖర్చుతో ప్రణాళికలు అమలు పరచబడినప్పటికీ దేశం ఇంకా ఇంకా అప్పులకై విదేశాల

మీద ఆధారపడవలసి వస్తున్నది. ఖర్చయినదానిలో చాలా భాగం వ్యక్తుల జేబుల్లోకి పోవడమే ఇందుకు కారణం.

షాపులో మందులుకొని వేసుకుంటే మందులు పని చేయవు; ఎరువులుకొని పొలాలకు వేస్తే ఎరువులు పనిచేయవు. అవి మందులూ కావు ఇవి ఎరువులూ కావు!

ఎప్పుడు ఎలా ఈ వంచననుండి మోసంనుండి విముక్తి అవుతాం?

వ్యక్తి, కుటుంబము, సమాజము – అనేమూడు గమ్య స్థానాలలో మూడవది మనస్సులో లేక పోవడమే దీనికి కారణం. ఈ సత్యాన్ని ఎల్లరూ గ్రహించి, జీవితంలో అనుస రించ వలసిన ఆవశ్యకత నేడు అత్యధికంగా వున్నది.

---

ప్రభుత్వం ఒక సహస్ర పాదజంతువులాంటిది. అది చక చకానడుస్తున్నట్టు ఉంటుంది గాని గమనం ముందుకో వెనక్కో తెలియదు. వెయ్యి పాదాలూ వెయ్యి వేర్వేరు దిక్కుల ప్రయాణించవచ్చు. ఫలితం అగమ్యం.

— శ్రీ సి. రాజగోపాలాచారి

# ఆశ నిరాశలు

ఆంగ్ల కవి జాన్ డ్రైడెన్ దీర్ఘమైన పద్యాలు వ్రాయక కేవలం రెండేసి పంక్తులలో సూటిగా తన భావాన్ని వ్యక్తీకరించేవాడు. అందులో వ్యంగ్యంవుండేది; విమర్శవుండేది; హెచ్చరిక వుండేది; జీవితానికి సందేశం వుండేది.

లలితమైన పదాలలో అనల్పమైన అర్థం ఇమిడ్చేవాడు. ఈ రెండు పంక్తులూ అలాంటివి:

Two men looked out of prison bars,
One saw the mud, and the other stars.

ఇరువురు వ్యక్తులు చెఱసాల కమ్ముాలనుండి బయటికి చూచారు. ఒకడు బురదను చూచాడు; రెండోవాడు నక్షత్రాలను చూచాడు.

ఇందులో పైకి కనిపించని చక్కని భావమొకటి వున్నది. ఇరువురూ ఖైదీలే. ఇరువురూ ఒకేపరిస్థితిలోవున్నారు. ఏవో నేరాలు చేసి జైల్లోపడ్డారు. సహజంగా నిరాశ నిస్పృహ వారి నలుముకొని వుంటాయి.

అలాంటి వారు రాత్రి సమయంలో ఇనుపకమ్ముాల గుండా వెలుపలికి చూచారు. ఒకడు ఎదురుగా మురుగు

కాలవలో కనిపిస్తున్న బురద వంక చూచాడు. రెండోవాడు సుదూరంగా ఆకాశంలో ప్రకాశిస్తున్న నక్షత్రాల వంక చూచాడు.

ఒకని మనస్సు అధైర్యంతో భవిష్యత్తుపై నిరాశతో నిండి వున్నది. అతని చూపు బురద మీదికి పోయింది. రెండవ వాడు అదే జైలులో ఖైదీగా వున్నప్పటికీ కష్టాలనుండి గట్టెక్కగలననే ఆత్మవిశ్వాసం వున్నందున అతని దృష్టి నక్షత్రాల మీదికి పోయింది.

అసలు ఆశావాదికీ నిరాశావాదికీ తేడా ఎక్కడున్నది? ఈ ప్రశ్నకు సమాధానం ఒక అజ్ఞాత ఆంగ్ల రచయిత యిలా సున్నితంగా పేర్కొన్నాడు:

" An optimist sees an opportunity in every difficulty ; a pessimist sees a difficulty in every opportunity. " — Anon.

ఆశావాది ప్రతి కష్టంలోనూ ఒక అవకాశాన్ని చూస్తాడు; నిరాశావాది ప్రతి అవకాశంలోనూ ఒక కష్టాన్ని చూస్తాడు!

ఈ ఆంగ్ల రచయిత అందంగా చెప్పాడు. ఆశావాదికి కష్టంలో కూడ ఏదో అవకాశం కనిపిస్తుంది. దాన్ని ఆధారం చేసుకొని పైకిపోతాడు. ఇబ్బందుల్లో కూడ అభివృద్ధికి మార్గం గోచరిస్తుంది. నిరాశావాదికి ఎన్నో అవకాశాలు

ముందరవున్నా, వాటి నతడు వినియోగించుకోలేడు. అందులో గూడ ఇబ్బందులే అతనికి కానవస్తాయి. చేతుల్లోకి వచ్చే విజయాన్ని గూడ కోల్పోతాడు.

ఖలీల్ జిబ్రాన్ లెబనాన్ దేశానికి చెందిన తత్త్వవేత్త. అతని కలం నిశితమైన ఖడ్గంలాంటిది. ప్రపంచంలో గొప్ప మేధావిగా విశిష్టస్థానం అలంకరించాడు. మణి దీపముల వంటి అతని కవితా ఖండికలు లోకంలో ప్రాచుర్యంపొందాయి. అతడిలా అంటాడు :

ఆశావాది చూసేది ముళ్ళనుకాదు; గులాబీని!

నిరాశావాది చూసేది ముళ్ళనే; కాదు గులాబీని!

అతడు చెప్పినట్లు మానవుడు చూచేరీతిలోనే మంచి చెడ్డలుంటాయి; వస్తువులోకాదు. అందుకే ఎల్లప్పుడూ వెలుగువైపు దృష్టివుంచు; చీకటి మీదికి చూపు పోనివ్వకు; ఇదే విజయానికి మార్గం అని పలువురు చెప్పారు.

Half full = Half vacant

అని ఒక చమత్కారంవున్నది. ఎలా ఇదిసాధ్యం?

ఒకగ్లాసులో సగానికి నీళ్ళుపోశారు. దాన్ని చూచి ఒకడు గ్లాసు సగం నిండివున్నదన్నాడు. "అబ్బే! సగంగ్లాసు ఖాళీగావున్నది" అని మరొకడన్నాడు. ఇరువురు చెప్పిందీ సత్యమే. కాని వారి ఆలోచనా సరళిలో తేడావున్నది.

గ్లాసు సగం నిండింది గనుక మిగతాభాగంగూడ నిండ గలదనే ఆశాభావం మొదటి వాడిలో కనిపిస్తుంది. కొంత వరకు నిండివున్నది గనుక ఒక రకమైన తృప్తి అతనిలో కని పిస్తుంది. మరికొంత కృషిచేస్తే గ్లాసులో మిగతాభాగాన్ని నింపవచ్చునవే ధైర్యం అతనిలో వున్నది.

రెండవవాడు చెప్పిందిగూడ సత్యమే. అయితే అతడు నిస్పృహతో ఆలోచిస్తున్నాడు. సగంగ్లాసు ఖాళీగావున్నది. లోటు అతనికి కనిపిస్తూవున్నది. ఆలోటు అతని మనస్సుమీద చెరగని ముద్రవేస్తున్నది. అట్టి నిస్పృహ వలన గ్లాసు ఎన్నటికీ నిండదనే నిర్ణయానికి వస్తున్నాడు.

అందుచేత కష్టమూ అవకాశమూ అనేవి వేరే ఎక్క డా లేవు. మనస్సులోనే వున్నాయి. దృఢ మనస్కుడైన వాడికి అంధకారంలోనే కాంతి రేఖ కనిపిస్తుంది; అదిలేనివాడికి పట్టపగలే చిమ్మచీకటిగా వుంటుంది. మనోధైర్యం ప్రధాన మైనది.

---

ప్రేమలేని శరీరం స్మశానంలోని శవంతో సమానం. కంచరివాని తోలుతిత్తి ప్రాణంలేకపోయినా శ్వాస తీసుకుం టూనే వుంటుంది! — కబీరు

# సుభాస్ చంద్రబోస్

అతడొక ఆంగ్లేయుడగు కాలేజి అధ్యాపకుడు. అతని పేరు ఎఫ్. సి. ఓటెన్. భారత ప్రజలను, భారతదేశాన్ని అవమానంగా చిత్రిస్తూ క్లాసులో మాట్లాడేవాడు.

అతని దూషణలను విద్యార్థిగా వుంటున్న సుభాస్ బోసు సహించలేక, క్లాసులో అందరూ చూస్తూవుండగా "నా దేశమంటే నీకంత చులకనట్రా" అంటూ అతని మీదికి లంఘించి పాదరక్షతో శాస్తి చేశాడు. ఆనాటి కలకత్తా విశ్వవిద్యాలయాధికారులు ఈ కారణాన సుభాస్ బాబును రెండేండ్ల వరకు చదివే వీలులేకుండా నిషేధపుటుత్తరువు జారీ చేశారు.

న్యాయవాదిగా పని చేస్తున్న శ్రీ జానకీనాధ్ బోస్‌కు ఆరవ కుమారుడుగా 1897 జనవరి 23 న జన్మించిన సుభాస్ ప్రతి పరీక్షలోను అత్యున్నత శ్రేణిలో పాసయేవాడు. తండ్రి పట్టుదల వలన ఇంగ్లండు వెళ్ళి ఐ. సి. ఎస్. పరీక్షలో గూడ నాలుగవ పేరులో సెలెక్టు ఐనప్పటికీ, ఆంగ్లేయులను కొలవడమా భారతమాతను కొలవడమా అనే విషయంలో దేశభక్తికే అగ్రస్థానమిచ్చి ఐ. సి. ఎస్. పదవికి ఇంగ్లండులో వుండగానే రాజీనామాయిచ్చి స్వదేశానికి మరలివచ్చాడు.

దేశబంధు చిత్తరంజనదాస్ ప్రియశిష్యుడుగా రాజకీయ రంగంలో అడుగుపెట్టిన సుభాష్‌బాబు భారత యువకహృదయ సామ్రాట్టుగా రాణించాడు. 1922లో బ్రిటిష్ సామ్రాజ్యంలో రెండవ మహానగరమైన కలకత్తాకు సి. ఆర్. దాస్ మేయరుగాను, సుభాష్‌బాబు ఛీఫ్ ఎగ్జిక్యూటివ్ కౌన్సిలర్‌గాను ఎన్నికైనారు. కార్పొరేషన్ ఉద్యోగులకు అధికారిక డ్రెస్‌గా ఖాదీ ప్రవేశపెట్టబడింది.

గాంధీజీమీద ఆయనకు ఎంతో గౌరవం వుండేది. కాని అహింసద్వారాను, సత్యాగ్రహాలద్వారాను స్వరాజ్యం రాదని సుభాష్‌బాబు అభిప్రాయం. సాయుధశక్తితోనే ఆంగ్లేయులను తరిమివేయాలని కోరేవాడు. గాంధీజీ నిలబెట్టిన డాక్టర్ పట్టాభి సీతారామయ్యను ఓడించి 1939లో త్రిపుర కాంగ్రెసు మహాసభకు సుభాష్ అధ్యక్షుడుగా ఎన్నికైనాడు. 103 డిగ్రీల జ్వరంతోనే మహాసభ కార్యక్రమాలు నిర్వహించాడు. మరు సంవత్సరం కాంగ్రెసునుండి విడిపోయి ఫార్వర్డ్‌బ్లాక్ పార్టీనిస్థాపించాడు.

మన శత్రువుయొక్క శత్రువు మనకు మిత్రుడు అనే విధానం ప్రకారం రెండవప్రపంచయుద్ధంలో ఆంగ్లేయుల శత్రువులైన జర్మనీ జపాన్ దేశాలు మనకు మిత్రులనీ, వారి సహకారంతో భారత స్వాతంత్ర్యం సాధించాలని ఆలోచించాడు.

మారువేషంతో సుభాష్‌బాబు కలకత్తానుండి అంత ధ్రాసమైబర్ కనుమకుండా ఆఫ్ఘనిస్థాన్ వెళ్ళి అటనుండి

మారువేషంలో బెర్లిన్ చేరాడు. అచటగల భారతయుద్ధ ఖైదీలను సమీకరించి స్వేచ్ఛాభారత సైన్యాన్ని ఏర్పరచడ మారంభించాడు.

1941లో జపాను యుద్ధంలో ప్రవేశించి థాయిలాండ్, మలయా, బర్మా, తూర్పు ఇండియా దీవుల నాక్రమించింది. ఆదేశాలలోగల భారతీయులను బాంకాక్ నగరంలో శ్రీ రాస బిహారీబోస్ అను దేశభక్తుడు సమావేశపరచి "ఇండియన్ ఇండిపెండెన్స్‌లీగ్" ఏర్పరచాడు. వారికి నాయకత్వం వహించడానికై సుభాస్‌బాబు జర్మనీనుండి జలాంతర్గామిలో బయలుదేరి సింగపూర్ వచ్చాడు.

1943 జులై 4న సింగపూర్‌లోని కేథే హాలులో జరిగిన భారతీయుల మహాసభలో సుభాష్ బోసు ఉపన్యసించాడు. భారత స్వాతంత్ర్య సాధనకై విరాళాలుగా మహిళలు తమ ఆభరణాలను యిచ్చివేశారు.

1943 అక్టోబరు 21వ తేదీన బోసు ప్రధానమంత్రిగా స్వతంత్ర భారత తాత్కాలిక ప్రభుత్వం సింగపూర్‌లో ఏర్పడింది. ఆ ప్రభుత్వాన్ని తొమ్మిది దేశాలు గుర్తించాయి. జపాను వారు ఆక్రమించిన అండమాన్ నికోబార్ ద్వీపాలలో ఆ ప్రభుత్వపాలన ఏర్పడింది.

50,000 మంది భారత యుద్ధ ఖైదీలతో అజాద్ హింద్ ఫౌజ్ నిర్మాణం చేయబడింది. ఇది ఐదుడివిజన్లుగా

విభజింపబడింది. మొదటి డివిజన్‌లో గాంధీ బ్రిగేడ్, అజాద్ బ్రిగేడ్, నెహ్రూ బ్రిగేడ్, సుభాస్ బ్రిగేడ్ అను నాలుగు బ్రిగేడ్‌లు ఉన్నాయి. ఒక్కొక్క బ్రిగేడ్‌లో 3,000 సైనికులున్నారు. కల్నల్ షానవాజ్ ఖాన్, కల్నల్ జి.ఎస్. ధిల్లాన్‌లు నెహ్రూ సుభాస్ బ్రిగేడ్‌లకు అధిపతులుగానున్నారు.

1944 ఫిబ్రవరి 4వ తేదీన షానవాజ్ ఖాన్ నాయకత్వాన అజాద్‌హింద్ ఫౌజ్ అస్సాంలోని ఇంఫాల్ మీదకు, తూర్పు బెంగాల్‌లోని చిటగాంగ్ జిల్లాలోనికి దండయాత్ర చేసింది. 'జైహింద్' 'ఢిల్లీ చలో' నినాదాలతో పరాధీన భారత్‌లో ప్రవేశించి 150 మైళ్ళు లోపలికి వచ్చింది.

వర్షాకాలం రావడంవలన, విమాన బలం లేనందున, అజాద్‌హింద్ సైన్యాన్ని బ్రిటిష్‌వారు ఓడించి బర్మాలోకి తరిమివేయ గలిగారు. 1945 ఆగష్టు 18న సుభాస్ బోసు విమానప్రమాదంలో మరణించినట్లు జపానువారు ప్రకటించారు.

సుభాస్ బోస్ తన దేశీయుల నుద్దేశించి చేసిన ప్రసంగాలలో కొన్ని భావములిలావున్నాయి.

"ఈ అశాశ్వతమైన ప్రపంచంలో ప్రతిదీ మరణిస్తుంది, నశిస్తుంది. కాని ఆశయాలు ఆదర్శాలు నశించవు.

ఒకవ్యక్తి ఒక ఆశయంకోసం మరణించవచ్చు. కాని అతని అనంతరం ఆదే ఆశయం కొన్ని వేలమంది మనస్సులలో

ప్రవేశించి రూపం దాలుస్తుంది. ఈరీతిలో ఉత్తమ ఆశాంశలు ఒకతరంనుండి మరొక తరం వారికి అందజేయబడతాయి.

ప్రపంచంలో ఏఆదర్శమూ గూడ బాధలు యాతనలు అనుభవించకుండ సాధింపబడలేదు.

ఒక సిద్ధాంతం కొరకు, ఒక ఆదర్శంకొరకు, జీవించి మరణించడంలోనున్న ఆనందం ఇంకెందులోనున్నది? తన అనంతరం తన ఆత్మ అనేకమందియొక్క మనస్సులలో ప్రవేశించి వారిని ఉత్తేజపరచి తాను అసంపూర్తిగా వదలివేసిన పనిని వారిచేత చేయిస్తుందనే సంతృప్తి కంటె మిన్నయైన సంతృప్తి ఎందులోవున్నది?"

"బాధల నెదుర్కొవడంవలన, త్యాగం చేయడంవలన ఎవడూ ఏమీకోల్పోడు. భూమి మీద అతడేదైనా కోల్పోయి నట్లయితే, నశించనటువంటి కీర్తికి అతడు వారసుడుకావడం ద్వారా, పోగొట్టు కొనిన దానికంటె అధికంగా మరల పొందుతున్నాడు.

జాతి జీవించడం కొరకు వ్యక్తి త్యాగం చేసితీరాలి; మరణించితీరాలి. ఈనాడు నేను మరణిస్తాను; అందుమూలాన భారతదేశం జీవిస్తుంది, స్వతంత్రాన్ని ఘనతను పొందుతుంది."

# రోగానికి మందు

ప్రఖ్యాత అమెరికన్ రచయిత డేల్ కార్నెగీ "How to stop worry and start living" అనే పుస్తకంలో ఒక జరిగిన సంగతి పేర్కొన్నాడు.

జాన్ రాక్ ఫెల్లర్ అమెరికాలో స్టాండర్డ్ ఆయిల్ కంపెనీ యజమాని. ప్రపంచంలో పేరొందిన కోటీశ్వరుడు. ఎంత సంపాదించాడో లెక్క లేదు. పరమ స్వార్థపరుడు. పిల్లికి బిచ్చం వేయని రకం.

ఒకమారతడు 40 వేల డాలర్ల ధాన్యం విదేశానికి ఎగుమతి చేశాడు. కాని సరుకు భీమా చేయలేదు.

నౌక అట్లాంటిక్ మహాసముద్ర మధ్యలో వుండగా బ్రహ్మాండమైన తుఫాను వచ్చిందని రేడియోలో వార్త వచ్చింది. వెంటనే మనిషి దిగాలుపడి పోయాడు. భాగస్వామిని పిలిచి అప్పుడైనా సరుకును భీమా చేసే వీలున్నదేమో తెలుసుకోమన్నాడు.

ఆ భాగస్వామి ఒకభీమా కంపెనీతో సంప్రదించి వెంటనే 150 డాలర్లు చెల్లించి సముద్రంలోవున్న సరకును భీమా చేశాడు. ఆ పిదప రాక్ ఫెల్లరుకు వార్తవచ్చింది - సరుకు

క్షేమంగా యూరోప్‌లో రేవుకు చేరిందని. ఇదివినగానే అతనికి మరింత బాధకలిగింది. "అయ్యో! 150 డాలర్లు వృధాగా భీమా కంపెనీకి కట్టబెట్టామే" అని వాపోయాడు.

ఇలాంటి రాక్ ఫెల్లర్‌కు మరొక జిజ్ఞాసలేదు; ఒక పుస్తకం చదవడం, ఒకనాటకం చూడడం కూడా లేదు. డబ్బే అతని మిత్రుడు. డబ్బే అతని దేవుడు. డబ్బు వచ్చే వీలుగనుక వుంటే ఎన్ని అవమానాలయినా భరిస్తాడు; ఎన్ని తిట్లయినా తింటాడు.

అలాంటి రాక్‌ఫెల్లర్‌కు 53వ ఏటికల్లా ముసలితనం వచ్చేసింది. తలవెంట్రుకలూడిపోయాయి. అజీర్ణవ్యాధి దాపురించింది. రాత్రి నిద్రపట్టదు. మనస్సులో వ్యాపారం గురించి ఒకటేదిగులు. కొమ్ములు తిరిగిన వైద్యులు వచ్చి పరీక్షచేశారు.

అతని వ్యాధియిది : స్వార్థపరత్వ ప్రకోపంవల్ల కలిగిన మితిమీరిన ధన దాహం. దానివల్ల మానసిక సంక్షోభం.

వైద్యులు ముక్తసరిగా రెండేమాటలు తేల్చిచెప్పారు. వెంటనే వ్యాపారంనుంచి విరమించాలి; లేదా ప్రాణంకోల్పోవాలి. డబ్బుకంటె ప్రాణంతీపి. అతడు వైద్యుల సలహా ప్రకారం వ్యాపారంనుండి విరమించాడు.

వైద్యులు చెప్పిన రెండవమాట - ప్రజోపయోగం కోసం ధనం వ్యయపరచమని! అతడు ఆనాటినుండి గ్రంథాలయాలకు, ఇతర సాంఘిక కార్యకలాపాలకు వెళ్ళడమారం

భించాడు; కోట్లకొలది డాలర్లు విద్యా, వైద్యశాలల నిర్మాణానికై వ్యయ పరచాడు. చికాగో విశ్వ విద్యాలయం కట్టించాడు. నీగ్రోలకొరకు టస్కేసీ కాలేజికి ధనమిచ్చాడు. రాక్‌ఫెల్లర్ ఫౌండేషన్ అనబడే అంతర్జాతీయ వైద్యసంస్థను నెలకొల్పాడు. ఈసంస్థవారే పెన్సిలిన్ కనిపెట్టారు.

ఈవిధంగా ఇతరుల మేలుకొరకు తాను ధనవ్యయం చేయడంవల్ల తనవల్ల ఇతరులకు దుఃఖం తొలగుతున్నదనే సంతోషం కలిగింది. ఆసంతోషంవల్ల అతనికి మనశ్శాంతి ఏర్పడింది. ఆరోగ్యం కుదుటబడింది. 53 సంవత్సరాలకు చావవలసిన వ్యక్తి 98 యేండ్లు జీవించాడు.

అతనివ్యాధి స్వార్థపరత్వం; దానికి మందు త్యాగం. రాక్‌ఫెల్లర్ డబ్బుకోసం స్వార్థపరుడైనాడు. కాని ప్రాణం డబ్బుకంటె ప్రధానంగనుక ఆరోగ్యం కోసం త్యాగాన్ని ఆశ్రయించాడు.

"నిజానికి స్వార్థరాహిత్యమే లాభదాయకం; అయితే దానిని ఆచరించే ఓపిక ప్రజలకులేదు" అన్నారు స్వామి వివేకానంద.

ఇదేవిషయం గురించి బెంజమిన్ ఫ్రాంక్‌లిన్ ఇలా అన్నాడు: "నీవు ఇతరులకు మేలు చేయడమంటే, నీకు నీవు మేలు చేసుకోవడమే."

న్యూయార్కులో ప్రఖ్యాత మానసిక శాస్త్రవేత్త హెన్రీ లింక్ ఇలాఅన్నాడు : "ఆనందకరమైన జీవితం గడపడానికి స్వార్థత్యాగం ఎలా ఆవశ్యకమో ఋజువు చేసేటువంటి పరిశోధనలు మానసిక తత్వశాస్త్రంలో అత్యంత అవసరమని నా అభిప్రాయం".

మితిమీరిన స్వార్థం వ్యక్తిని మానసిక అశాంతికి, వ్యాధులకు గురిచేస్తుందని, ఇతరులకు మేలు చేసే స్వభావాన్ని అలవరచుకోవడంవల్ల ఆరోగ్యం, ప్రశాంతత లభిస్తాయని తెలుస్తున్నది.

---

చిన్నకథలో పెద్ద గుణపాఠం-4

## అవినీతిపరునికిగూడ "నీతి"కావాలి!

ఇటీవల వచ్చిన ఒకసినిమాలో సన్నివేశ మొకటున్నది. ఇంటి పట్టున వుండక దొరికింది తింటూ ఉల్లాసంగా తిరిగేతుళ్ళవాడొకడున్నాడు. కోతులతో పోటీ పడుతూ అవి తెచ్చుకుతింటున్న అరటి పళ్ళు లాక్కుని తాను తింటాడు. చెట్ల క్రిందా చేమల క్రిందా కాలం గడుపుతాడు.

చేతిలో డబ్బులు లేవు. పొట్టగడవడ మెలా ? ఒక ఉపాయం తోచింది ........ రోడ్డుమీద రివ్వున కారు వస్తు

న్నది. అమాంతం వెళ్ళి కారుక్రింద పడ్డాడు. డ్రైవర్ సడన్ బ్రేకు వేసి కారాపాడు.

ఇతను "కాలువిరిగిందో" అని దొంగఏడుపు ఏడుస్తు న్నాడు. కారుకు అడ్డంగాపడుకొని "నేను చస్తే మాఅమ్మను ఎవరు చూస్తారో" అంటూ శోకాలారంభించాడు.

ఎదురుగావున్న ఇంటిలోనుంచి మరొకడు పరుగెత్తు కుంటూవచ్చి "ఏయ్, నాతమ్ముడిమీదుగా కారుపోనిస్తావా? వాడుచస్తే మాఇల్లు ఎలాగడుస్తుంది?" అంటూ డ్రైవరు చొక్కాపుచ్చుకున్నాడు. పద పోలీసు స్టేషనుకు పదమన్నాడు.

డ్రైవరిచ్చే డబ్బు చెరిసగం పంచుకుందామని ఇద్దరూ సైగ చేసుకున్నారు. డ్రైవరు యాభై రూపాయలిచ్చి వీళ్ళను వదిలించుకొని కారునడుపుకొని పోయాడు.

ఆతర్వాత వీళ్ళిద్దరూ డబ్బుకోసం కీచులాడు కున్నారు. "నీకు కాలూవిరగలేదు; చెయ్యీవిరగలేదు; నీకిచ్చేదేమిటి పో" అంటూ అన్నగా నటనచేసినవాడు ఆ యాభై రూపాయలూ జేబులో వేసుకొని "మళ్ళీమాట్లాడితే తంతాను" అని బెదిరించి వెళ్ళిపోయాడు.

అపుడు మొదట్లో కారుక్రింద పడ్డవాడు "ఎంతమోసం! ఇలాగయితే ఈదేశం ఏం బాగుపడుతుంది?" అంటూ చింతించాడు.

నిజానికి ఇద్దరూ మోసగాళ్ళే. మొదటివాడు తాను కారుడ్రైవరును మోసగించినంతవరకు బాగానే వున్నది. తనను మరొకడు మోసగించినపుడు విషాదం కలిగింది. "ఇలాగైతే దేశం ఇంకేం బాగుపడుతుంది?" అనుకుంటున్నాడు.

ఇతరులను తాను దగాచేసినంతసేపు, తాను లంచం పుచ్చుకున్నంతసేపు, ఆనందంగావుంటుంది. ఇతరులచే మోసగింపబడినపుడు, ఇతరులు తనకు దగాచేసినపుడు విషాదం కలుగుతుంది. నీతియొక్క అవసరం అపుడు తెలుస్తుంది.

అవినీతి పరుడు సైతం నీతిని కోరుతాడు!

---

పనిలోని మాధుర్యం-7

## సాధన ఆపితే అభివృద్ధి ఆగుతుంది

పూర్వం ఒకవూళ్ళో ఒక పెద్దమనిషి వున్నాడు. అతడు భాగ్యవంతుడు కాదలచి లక్ష్మీదేవిని గురించి తపస్సుచేశాడు. ఒకనాడు ఆతల్లి ప్రత్యక్షమై "నీవు ముందు నడుస్తూవుండు. నేను నీవెనుకనే వస్తాను. కాని నీవు ఎప్పుడైతే వెనక్కు తిరిగి చూస్తావో నేనప్పుడే ఆగిపోతాను. ముందుకు కదలను.... ఇకనడువు" అన్నది.

అతడు నడక ఆరంభించాడు. లక్ష్మీదేవిని తన గృహానికి తీసుకు వెళ్ళాలని అతని వాంఛ. ఒక బాలిక రూపంతో లక్ష్మీదేవి వెనుక వస్తున్నది. గజ్జెలు, గాజులు, ఆభరణాలు ధరించి సర్వాలంకారాలతో నడుస్తున్నది. వింత వింత ధ్వనులుచేస్తూ అడుగులు వేస్తున్నది. కొంతదూరం పోయేసరికి ఆ ధ్వను లేమిటో చూడాలని, ఆమె వస్తున్నదో లేదో పరిశీలించాలని అతనికి కుతూహలం కలిగింది. వెనక్కు తిరిగి చూచాడు, ఆ బాలిక అక్కడే శిల అయిపోయింది. ముందుకు కదలలేదు. అతని ఆశ నిరాశ అయింది.

ఈకథ జరిగిందా లేదా అనేది ప్రశ్నకాదు. ఇందులో ఒక మహత్తర సత్యం దాగివున్నది. ధనము, విద్య, లలిత కళలు – ఇలాంటివాటిని సాధించాలని మానవుడు ఆరాట పడుతుంటాడు. ఆ రంగంలో సాధన చేస్తున్నంతకాలం అవి వెంట వస్తూనే వుంటాయి; అభివృద్ధి చెందుతూనే వుంటాయి.

కొంతకాలం గడుస్తుంది. "ఆహా! ఫరవాలేదు. నేను కొంత సాధించాను" అనే అహంకారంతో, ఒకవిధమైన ధీమాతో వెనుకకు తిరిగి చూస్తే అతని అభివృద్ధికి అంతటితో అడ్డుకట్ట పడుతుంది; పగ్గాలువేసి లాగినాసరే ముందుకు కదలదు!

దేశంలో అనేకుల పురోభివృద్ధికి అడ్డుతగిలేది ఈ తత్వమే. తాము ఫలానా విషయంలో ఏదో సాధించామనే ధీమా

మనుషులను అఖాతంలోకి ఈడుస్తుంది. పై కథలో పెద్దమనిషి కొంతదూరం పోయిన తరువాత వెనుకకు తిరిగిచూచాడు. కాని మనలో అనేకులు సాధన ఆరంభించీ ఆరంభించక మునుపే వెనుదిరిగి చూస్తారు. అందువల్ల బయలుదేరిన చోటనే వుంటున్నారు.

శక్తిగాని, విద్యగాని, ధనంగాని, కళగాని తనకున్నదని తెలియక పోవడమే అభివృద్ధికి సోపానం. హనుమంతుడు మహా శక్తిమంతుడు. ఒక్కమారు కుప్పించి ఎగిరితే లంకలోకి పోయి పడ్డాడు. సంజీవి పర్వతాన్ని అమాంతం ఎత్తుకు వచ్చాడు. కాని అంత బలవంతుడని అతనికి తెలియదు. ఇతరులు అతని బలాన్ని అతనికి జ్ఞాపకం చేస్తే అపుడతడు గ్రహించి బల ప్రదర్శన చేశాడు; జయం పొందాడు.

సోక్రటీసు విషయంలో ఇదే కనిపిస్తుంది. అతనిని ఒకరు ప్రశ్నించారు. "మిమ్ము అందరూ మహాసీయునిగ ఎందుకు పరిగణిస్తా"రని. అందుకు సోక్రటీసు "నాకు ఏమీ తెలియదని నాకు తెలుసుగనుక" అని అన్నాడు. ఈమాటలలో ఎంతో అర్థ మున్నది. వ్యక్తుల అభివృద్ధికి ఈ భావన చాలా అవసరం.

---

చిక్కువడిన దారపువుండ జీవితమ్ము
ఒకటి విడదీయ చూడ వేరొకటిపడును.

— ఆచార్య ఆత్రేయ

ఎందరో మహనీయులు-5

# మహాత్మా గాంధీ

"గౌతమ బుద్ధుని అనంతరం భారతదేశంలో ఇంతటి మహా వ్యక్తి జన్మించలేదు, జీసస్ క్రీస్తు అనంతరం ప్రపంచం ఇంతటి మహాపురుషుని చూడలేదు" అని గాంధీమహాత్ముని గురించి రివరెండ్ డాక్టర్ జె. హెచ్. హోమ్సు అను అమెరికన్ దేశీయుడు వ్యాఖ్యానించాడు.

"ఈ భూమిమీద అట్టి మహాత్ముడొకడు రక్త మాంసాలు గల శరీరంతో మనుగడ సాగించాడంటే ముందు తరాలవారు బహుశా నమ్మలేక పోవచ్చును" అని ప్రఖ్యాత విజ్ఞాన శాస్త్రవేత్త ఐన్‌స్టీన్ గాంధీజీని గురించి అభిప్రాయం వెలిబుచ్చాడు.

తన దేశీయులనేగాక దేశ దేశాలలోని ఆలోచనాపరులను; రాజనీతివేత్తలను, స్వేచ్ఛా పిపాసులను ఆకర్షించి ఆశ్చర్య చకితులనొనరించిన మోహనదాస్ కరంచంద్ గాంధీ 1969 అక్టోబరు 2న కరంచంద్ గాంధీ, పుత్లీబాయ్‌లకు కథియవాడ్ లోని పోర్‌బందర్‌లో జన్మించాడు.

చిన్నతనంలో గాంధీ రామాయణంలో శ్రావణ కుమారుని పితృభక్తి గురించిన నాటకం చదివి ప్రభావితు

డై నాడు. ఒకనాడు వీధిలో బొమ్మలు చూపేవాడొకడు అతనికి శ్రావణకుమారుడు అంధులైన తల్లిదండ్రుల నిద్దరినీ కావడిమీద పుణ్యక్షేత్రాలకు తీసుకొని వెడుతున్న చిత్రాన్ని చూపించాడు. ఆనాటకము, ఈచిత్రము, గాంధీయొక్క లేత మనస్సులో తల్లి దండ్రుల యెడ శాశ్వతమైన ఆదరాభి మానాలను కలుగ జేశాయి.

దశరథమహారాజు పొరపాటున అడవి జంతువని వేసిన బాణంతో శ్రావణకుమారుడు మరణించాడు. అతని తల్లి దండ్రులు తమకున్న ఒకేఒక ఆశ్రయం పోగొట్టుకొని హృదయ విదారకంగా శోకించిన పాట బాపూజీ హృదయంలో చెరగని ముద్రవేసింది. అతడు బాల్యములో ఆగీతాన్ని అనేకమార్లు ఆలపించి పరవశంచెందేవాడు.

గాంధీకి మాతాపితరులమీద అచంచలమైన భక్తి గౌరవాలుండేవి. పెద్దవాడైన తర్వాత ఒక మారాయన "నా తల్లిదండ్రులను భగవంతునివలె ఆరాధించిన సత్ఫలితాలను నాజీవితంలో అనుక్షణం నేను అనుభవిస్తున్నాను" అని అన్నారు.

ఆయన 13వ ఏట కస్తూరిబాను వివాహమాడారు. ఇంగ్లండు వెళ్ళి 1891 లో బారిష్టరు పట్టా తీసుకొని స్వదేశానికి మరలివచ్చి రాజకోటలోను బొంబాయిలోను న్యాయ వాదిగా పనిచేశారు. 1893 లో ఒక భారతీయ వ్యాపారసంస్థ

పక్షాన వాదించడానికై దక్షిణాఫ్రికాకు వెళ్ళారు. దక్షిణాఫ్రికా లోని యూరోపియన్ ప్రభుత్వంక్రింద అచటి భారతీయులు అవమానాలకు అత్యాచారాలకు గురి అవుతున్నారు. ఆసియా వాసుల రిజిస్ట్రేషన్ చట్టంప్రకారం భారతీయులందరు నేరస్థుల వలె తమ పేర్లను పోలీసుస్టేషనులో నమోదు చేయించు కోవాలి; తమ చేతివ్రేలిముద్రలనివ్వాలి. తెల్లవారు ఎక్కిన రైలు పెట్టెలలో భారతీయులు ఎక్కేవీలు లేదు. ఇట్టి అమానుష చట్టాలకు వ్యతిరేకంగా గాంధీజీ అచట సాత్విక నిరోధ కార్యక్రమం చేపట్టారు. దానికే సత్యాగ్రహమని నామకరణం చేశారు. అచట "టాల్‌స్టాయ్ ఫారం" అను కుటీరం తన నివాసంగా చేసుకొని దక్షిణాఫ్రికాలో 21 సంవత్సరాలుండి భారతీయులకు పౌరహక్కులను సాధించి స్వదేశానికి మరలి వచ్చారు.

సత్యము, అహింస, అస్పృశ్యతానివారణ, హిందూ ముస్లిం ఐక్యతలను వారు తమ లక్ష్యాలుగా పెట్టుకున్నారు. 1919 లో జలియన్ వాలాబాగ్‌లో జనరల్ డయర్ జరిపిన దురంతాలకు నిరసనగా ఆంగ్ల ప్రభుత్వం తనకొసంగిన "కైజర్-ఇ-హింద్" బిరుదమును త్యజించారు.

భారతజాతీయ కాంగ్రెసును జనబాహుళ్యంలోకి గొని పోయి, దానినొక ప్రజోద్యమంగా రూపొందించిన ఘనత గాంధీజీకి చెందుతుంది. 1921 లో వారు నిర్వహించిన సహాయ

విరాకరణ ఉద్యమంలో దేశమంతటా 25,000 మంది వాలంటీర్లు అరెస్టు కాగా, 1930లో వారి నేతృత్వంలో జరిగిన శాసనోల్లంఘనోద్యమంలో 60,000 మంది వాలంటీర్లు శ్రీకృష్ణజన్మస్థానాల నలంకరించారు.

1932లో రౌండ్ టేబుల్ సభలకై ఆయన ఇంగ్లండు వెళ్ళినపుడు తన మామూలు అంగవస్త్రం ధరించి బ్రిటిష్ చక్రవర్తి ఐదవజార్జిని దర్శించాడు. మీరంత కొంచెం దుస్తులు ఎందుకు ధరిస్తారని ఎవరో అడుగగా, "భారతదేశంలో లక్షలాది ప్రజలు అంగవస్త్రం మాత్రమే ధరించగలిగి యున్నారు. అందుచేత నేనుగూడ అంగవస్త్రమే ధరిస్తాను. నన్ను చాలా మంది అర్ధనగ్నంగా వున్నానని అంటున్నారు. అయినా నేను మనస్ఫూర్తిగా దేశంలోని బీదాతి బీదలతో సాన్నిహిత్యం కోసం ఈ అంగవస్త్రాన్ని ధరిస్తున్నాను" అని సమాధానం చెప్పారు.

వారు అంగవస్త్రం ధరించి చక్రవర్తిని సందర్శించడం గురించి ఒక ఫ్రెంచి విలేఖరి ప్రశ్నించగా "మీ దేశంలో కావలసిన దానికంటె నాలుగు ఎక్కువ వేసుకుంటారు; మా దేశంలో నాలుగు తక్కువ వేసుకుంటాం" అని నవ్వుతూ అన్నారు.

మరో విలేఖరి అదే ప్రశ్న వేస్తే గాంధీజీ "చక్రవర్తి ఒంటిమీద నాకూ ఆయనకూ సరిపడే దుస్తులున్నాయి" అని చమత్కరించారు!

ఒక మారు పత్రికావిలేఖరుల సమావేశంలో ఒక విలేఖరి "భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చాక మీరు ప్రధాన మంత్రి అవుతారా?" అని ప్రశ్నించాడు. "కాను. ఆ పదవి యువకుల కోసం ఉద్దేశించబడింది" అన్నారాయన. "ప్రజలు మీరే వుండాలని బలవంతపెడితే?" అన్నాడావిలేఖరి. "మీలాంటి విలేఖరుల చాటున ఆశ్రయం తీసుకుంటాను" అన్నారు బాపు.

వార్ధా సమీపంలోగల సేవాగ్రాంలోను, గుజరాత్‌లోని సబర్మతి ఆశ్రమంలోను ఆయనవుండేవారు. ఆయన ఎచట వుంటే అదే దేశానికి రాజకీయ కేంద్రంగా విలసిల్లేది. యంగ్ యిండియా, హారిజన్ పత్రికలకు వారు సంపాదకత్వం వహించారు.

దేశానికి స్వతంత్రం రాగానే ఒక విదేశ పత్రికా విలేఖరి "దేశస్వతంత్రం మీకిరీటం" అని అభినందించగా, "కాని, దేశవిభజన నా శిలువ" ("Independence is your crown" ........ "But partition is my cross") అని విషాదంతో జవాబిచ్చారాయన.

వారు వెలిబుచ్చిన భావాలలో కొన్ని యివి:

"ప్రజలే వేళ్ళు; ప్రభుత్వమే ఫలము. వేళ్ళు తియ్యగా వుంటేనే పండు తియ్యగావుంటుంది."

"దేశంలో దారుఢ్యవంతులైన ఒక్క పురుషుడుగాని స్త్రీగాని పనీ తిండీ లేకుండా ఉన్నంతవరకు మనం విశ్రాంతి

గాని, పూర్ణభోజనం గాని అనుభవించడానికి సిగ్గుపడవలసి వుంటుంది."

"సౌశీల్యరహితమైన విద్య వినాశకారి. అనేకమంది తెలివి తేటలుగల చోరుల విషయంలోను, పెద్దమనుష్యులుగా చెలామణి అవుతూ వెనుకనుండి కుట్రలుపన్నే వ్యక్తుల విషయంలోను ఈసంగతి మనకు ఋజువవుతుంది."



దేశంయొక్క ప్రాతిపదికలు—1

## వస్త్రోత్పత్తి

ప్రతివ్యక్తీ సుఖపడాలని కోరుకుంటాడు. కష్టాలను ఎవరూ ఆహ్వానించరు. సుఖమనేది ఎల్లరకూ ఇష్టమైన పదార్థం. ఇందులో అభిప్రాయభేదం లేదు.

సుఖమంటే ఏమిటి? చాలమంది అభిప్రాయంలో సుఖమంటే అర్థం రోజుకు మూడు సినిమాలు చూడడం, నగ్న నృత్యాలను వీక్షించడం, లోకాన్ని మరచిపోయేటంతగా తప్ప త్రాగిపడివుండడం, విచ్చలవిడిగా కామవాంఛ పొందగోరడం—ఇదే సుఖమని పలువురి అభిప్రాయం.

కాని ఇది సుఖంకాదు. ఒకజాతి తనకుతాను ఆత్మహత్య చేసుకొనే మార్గమిది. ఈ రకంగా ఇంద్రియ సుఖాలకు లోను కావడంవలన ప్రజలలో పురుషకారం నశించి జాతిలో చేవ చచ్చిపోతుంది. ఇందుకు ఫ్రాన్సుదేశమే ఉదాహరణ.

రెండవ ప్రపంచయుద్ధంలో జర్మనీ చేతిలో ఫ్రాన్సు పరాజయం చెందినపుడు ఫ్రెంచి సర్వసైన్యాధిపతి మార్షల్ పెటైన్ ఇలా అన్నారు: "ఫ్రాన్సు ఓడిపోయింది యుద్ధ రంగాలలో కాదు; అది విలాసభవనాలలో ప్రజలకుగల లోలత్వం వల్ల ఓడింపబడింది. జాతులయొక్క, నాగరికతయొక్క వినాశనానికి సెక్సుప్రధానమైన సాహిత్యమే స్పష్టమైన సూచనయని వివిధ దేశాల చరిత్ర మరల మరల నిరూపిస్తున్నది".

( " France was defeated not on the battle fields but in the ball-rooms. History of countries, the world over, has, time and again, shown that sex - dominated literature has been an unfailing precursor to the ruins of nations and civilisations "

— Marshall Petain)

అందుచేత ప్రజలు వాంఛించవలసిన సుఖం ఇదికాదు. సుఖానికి చెప్పుకోవలసిన అర్థం మరొకటున్నది.

శరీరము, మనస్సు, బుద్ధి, వికసించి నాగరికత సంస్కృతి సభ్యతలు గల మానవునిగా రూపొందడానికి అవసరమైన వసతులు (Comforts), ఉపకరణాలు పొందగలగడమే సుఖమని

భావించాలి. అంతేగాని విలాసాలు అనుభవించడాన్ని కోరవలసిన సుఖంగా పరిగణించగూడదు. అట్టి విలాసాలు వ్యక్తిని పశువుగాను అమానుషమైన జీవిగాను క్రమంగా మార్చివేస్తాయి.

మానవునికి వసతులు ఉపకరణాలు లభ్యమయే మార్గమేమిటి? ఏమిటా వసతులు?

ఉదయంలేచి కాఫీ త్రాగుతాం. కప్పు కాఫీ నోట్లోపడాలంటే మైసూరునుండి కాఫీగింజలు రావాలి; బోధన్‌నుండి పంచదార రావాలి; పల్లెనుండి పాలు రావాలి. అన్నిరకాల వస్తువులు "ఉత్పత్తి" అయి లభ్యమైతే కాఫీ చేతిలోకి వస్తున్నది.

సైకిలుమీద కాలేజికి వెళ్ళాలంటే సైకిలుయొక్క టైర్లు, ట్యూబులు, సీటు, స్ప్రింగులు, హ్యాండిలు — ఇవన్నీ ఏ మద్రాసులోనో "ఉత్పత్తి" అయి రావాలి.

తెల్లవారి దినపత్రిక చదవాలంటే ఆ దినపత్రికకు న్యూస్ ప్రింట్ చాలినంత సరఫరా కావాలి. దేశంలో కాగితం "ఉత్పత్తి" సరిపోయినంత జరుగనందున పత్రికలో పేజీలు తగ్గినాయి; వార్తలు తగ్గినాయి; వ్యాసాలు తగ్గినవి; అందుచేత పాఠకులు దినపత్రికవల్ల పొందుతున్న సంతృప్తి తగ్గింది; "సుఖం" తగ్గింది.

అందుచేత దేశంలో వస్తువుల ఉత్పత్తికీ మనసుఖానికీ లంకె ఉన్నది! మనస్ఫూర్తిగా మనం సుఖపడాలని కోరుతున్న

ట్లయితే, అందుకుమార్గం దేశంలో వస్తువుల ఉత్పత్తి పెరగాలి; ఆహారధాన్యాలు అధికంగాపండాలి; కాయగూరలు, గుడ్లు, కాగితం, మందులు, తేనె, పాలు, వెన్న, కలాలు, సైకిళ్ళు, మైర్లు, ట్యూబులు, పంచదార, సిమెంటు, ఇటుకలు, రేడియోలు, గడియారాలు, చెప్పులు — ఇలా కొన్నివందల వస్తువులు తయారుకావాలి. మనం సుఖపడాలంటే పొలాలు, పరిశ్రమలు నిరంతరం వస్తువుల ప్రవాహాన్ని మార్కెట్‌లోకి పంపుతూవుండాలి.

"ఉత్పత్తిచెయ్యి లేదా నశించు" — (Produce or perish) అను వాదన సత్యమైనది. దేశాన్ని నిలిపి వుంచేటు వంటి ప్రాతి పదికలగు మూడుస్తంభాలలో ఒకస్తంభం "వస్తూత్పత్తి." ఆ స్తంభంవిరగకూడదు; ముక్కపోకూడదు; దెబ్బతినగూడదు!

సంపద అంటే అర్థం బంగారంకాదు; కరెన్సీకాదు; సంపదఅంటే వస్తువులే!

---

ఏదైనా ఒక పనినిగురించి ఆపని చెయ్యనివాళ్ళు ఆదర్శ ప్రాయంగా మాట్లాడుతారు. ఆపని చేస్తున్నవాళ్ళు ప్రత్యక్ష ప్రాయంగా మాట్లాడుతారు!

— భమిడిపాటి కామేశ్వరరావు

దేశంయొక్క ప్రాతిపదికలు - 2

# రక్షణ శక్తి

---

ఆఫీసులో ఉద్యోగం చేస్తూ రేపోమాపో రిటైరు కాబోయే వ్యక్తిని "ఏమండీ! ఈవృద్ధాప్యంలో మిమ్ము కలవర పెడుతున్న ప్రధాన సమస్య లేమిటి?" అని ప్రశ్నిస్తే ఏమిచెపుతాడు?

"ఏముందండీ! పిల్లవాడు బి. కాం. ప్యాసై యింట్లో కూచున్నాడు. వాణ్ణి ఏమున్సిపాలిటీలోనైనా చేర్పించాలి. ఈడొచ్చిన పిల్ల ఇంట్లోవున్నది. దాన్ని ఏ అయ్య చేతిలోనైనా పెట్టాలి. ఈరెండూ సానుకూలమైతే నాకు చీకూ చింతా వుండదు" అంటాడు.

అలాగే ఒకదేశంయొక్క అధినేతను "పరిపాలకులుగా మీరు అత్యంత జాగ్రత్త వహించే విషయాలు ఏవి?" అని అడిగితే, ఆయన మూడు విషయాలు పేర్కొంటాడు.

అందు మొదటిది ప్రజల అనుదిన జీవితాలకవసరమైన వందలకొలది వస్తువులు దేశంలో పుష్కలంగా తయారు కావడం. వాటి ఉత్పత్తికి ఎలాంటి ఆటంకాలు ఏర్పడరాదని, పరిశ్రమల్లో సమ్మెలు, లాకౌట్లు జరగరాదనీ, ఉత్పత్తిని పెంచే ప్రతి ప్రయత్నమూ జరగాలనీ కోరుతాడు. ఉత్పత్తి చాలినంత లేనపుడు ధరలు పెరగడం; వేతనాలు పెరగడం,

కరెన్సీవిలువ పడిపోవడం, దేశంలో అవినీతి పెరిగిపోవడం, ప్రజలలో నైతికపతనం ఏర్పడి దేశం కల్లోలాలకు ఆలవాల మవడం జరుగుతుంది. అందుచేత దేశంలో "ఉత్పత్తిదారు"లకు సముచిత స్థానంవుండాలి. కాయగూరలు, ధాన్యము, మందులు, మొదలైనవాటిని ఉత్పత్తిచేసేవారు సమాజానికి ఎంతో సేవచేస్తున్నట్లు పరిగణించాలి. ఆఖరుకు ఇటుకలు తయారు చేసేవాడు కూడ దేశానికి ఎంతో మేలు చేకూరుస్తున్నాడు!

దేశంయొక్క అధినేత శ్రద్ధవహించే రెండవ విషయం దేశరక్షణను గురించి.

దేశంలో సంపద వున్నంత మాత్రాన సంతోషంలేదు. దానికి రక్షణవుండాలి. భారతదేశం యొక్క సంపద గురించి విని, దానిని దోచుకోవడానికే ఆఫ్ఘనులు, తురుష్కులు, మొగలాయిలు, దండయాత్రలుచేశారు. గజనీ మహమ్మద్ పంజాబులోని నాగర్ కోటను దోపిడీ చేసినప్పుడు 700 మణుగుల బంగారాన్ని, వెండిపాత్రలను, రత్నములను ఒంటెలమీద తీసుకొని వెళ్ళాడు. ఆదోపిడీలో 30 గజముల పొడవు, 15 గజముల వెడల్పుగల వెండితో నిర్మించబడిన గృహము కూడ వున్నదట! మన దేశంలో విదేశీయులు జరిపిన కొన్ని వందల దోపిడీలలో ఇది యొకటిమాత్రమే.

అసలు యిరోపావారు ఇండియాకు ఎందుకు వచ్చారు? ఇది పేదదేశమైతే వచ్చేవాళ్ళేకారు. ఇది సంపన్న దేశం

కనుకనే ఇచట వ్యాపారం చేయాలని వచ్చారు. క్రీ. శ. 1500 వరకు అరబ్బులు మనదగ్గిర వస్తువులను కొని, వాటిని ఐరో పాకు ఎగుమతిచేసి ధనవంతులైనారు. వారికి పోటీగా వ్యాపారం చేయడంకోసం పోర్చుగీసువారు నూతన సముద్ర మార్గాన్ని కనిపెట్టి, ఆఫ్రికాను చుట్టివచ్చి ఇండియా చేరుకున్నారు. అలాంటి పాశ్చాత్యులు ఇచట రాజకీయాధికారాన్ని హస్తగతం చేసు కున్నారు.

ఇండియాలో షాపులు పెట్టుకోడానికి మనరాజులవద్ద లైసెన్సులు పొందిన తూర్పు ఇండియా కంపెనీ ఇచట రాజ్యం స్థాపించడమేమిటి? ఆరాజులకే భరణాలిచ్చి ఇంట్లో కూర్చో పెట్టడమేమిటి? మనసంపద వారి నాకర్షించింది; రక్షణఎడ మన నిర్లక్ష్యం వారి నిక్కడ సింహాసన మెక్కించింది. ఎంత విషాదకర దృశ్యం!

"వెట్టివాడిభార్య వాడకల్లా లోకువ" అని సామెత. అసమర్థునివద్ద రూపవతియగు భార్యవున్నా, రత్నభాండాగారం వున్నా వాటికి రక్షణలేదు. అవి పరాధీనమవుతాయి. దేశం విషయంగూడ అంతే. నవీన ఆయుధాలతో, దేశంమీద అచం చలప్రేమతో, కచ్చితమైన క్రమశిక్షణతో దేశాన్ని కాపాడే సైనికబలంవుండాలి. సైనికబలాలలో పనిచేయడం గౌరవ ప్రదమనే భావన ప్రజలలో కలగాలి.

అలాంటి భావన లేదు. సైన్యంలో చేరడమంటే చావడానికి పోవడమేననే దురభిప్రాయం మన ప్రజలలో వున్నది. 1962లో చైనాతో మనకు యుద్ధం జరుగుతున్నపుడు ప్రభుత్వ సూచనల ప్రకారం పోలీసు కానిస్టేబులు ఒక గ్రామానికి వచ్చి గ్రామ మున్సబ్ కు సర్కారువారు పంపిన ఒక సర్క్యులర్ చూపించాడు. "దేశం విపత్తు నెదుర్కొంటున్నది. యువకులు సైన్యంలో చేరి దేశరక్షణకై సహకరించాలి. ఈ విషయాన్ని గ్రామంలో దండోరా వేయించి గ్రామాధికారులు ప్రభుత్వానికి తెలియజేయాలి" అని అందులో వున్నది.

గ్రామాధికారి అది చదువుకొని "ఈ పాపం నాకెందుకులే. వూళ్ళో టముటమా వేయించినట్లు సంతకం పెడతాను. తీసుకు వెళ్ళు" అని ఆకాగితం పోలీసుకిచ్చి పంపాడు.

దేశ ప్రజలను సాయుధ బలాలతో చేరి పనిచేయమని ప్రోత్సహించడం "పాపం" అని భావించే దేశం క్షేమంగా వుండజాలదు. పాశ్చాత్య దేశాలలో విద్యావంతులు, ఉన్నత కుటుంబాలకు చెందినవారు సైన్యంలో చేరుతారు. రెండవ ప్రపంచ యుద్ధంలో రష్యా అధినేత స్టాలిన్ యొక్క కుమారుడు సాయుధ బలాలలో కమాండర్ గా పనిచేశాడు. యుద్ధంలో జర్మనులకు ఖైదీగా చిక్కాడు. బ్రిటిష్ ప్రధాని చర్చిల్ కుమారుడు విమాన దళంలో పనిచేశాడు. అమెరికా అధ్యక్షుడు కెనడీ నౌకాదళంలో పనిచేశాడు. ఐసెన్ హోవరు అమెరికన్ సేనానిగా పనిచేశాడు.

కాని భారతదేశంలో సాయుధబలాలలో చేరి పనిచేయడం గౌరవప్రదమైన వృత్తిగా ప్రజలు భావించడంలేదు. సైనికునికి ఆస్తికంటె, ధనంకంటె, వస్తువులకంటె, ఆఖరుకు తాను ప్రేమించి పెండ్లాడిన భార్యకంటె విలువైనది తన రక్తం. మరి, తమరక్తం కార్చి, ప్రాణాలొడ్డి దేశాన్ని కాపాడే సైనికులకు సమాజం ఎంత కృతజ్ఞతచూపాలి! ఎంత ప్రాధాన్యమివ్వాలి!

---

దేశంయొక్క ప్రాతిపదికలు - 8

# సరియైన విద్య

"ఆస్థాన కవియొక్క కుమారుడికైనా విద్యాభ్యాసం ఓనమాలతోనే ఉపక్రమించాలి" (Even the son of a poet laureate should begin his studies with alphabets) అని ఆంగ్లంలో ఒక సామెత. ఇందులో చాలా అర్థంవున్నది.

తండ్రి మహాపండితుడైనా కుమారుడికి విద్య దానంతటది సంక్రమించదు. 'రఘు వంశం'తో కొడుక్కి విద్యారంభం చేసేవీలులేదు; అక్షరాభ్యాసంతోనే ప్రారంభించాలి.

ఎందువల్ల? ఏ తరానికాతరం నూతనంగా జీవితాన్ని మొదలు పెట్టుకు పోవలసిందేగాని గోడకట్టినట్లు గాతిమీద

రాయి పెట్టుకు పోవడానికి వీలులేదు. ఒక తరంవారు గొప్ప విషయాలు సాధిస్తే సరిపోదు, ప్రతితరమూ నూతనమైనదే. ప్రతితరానికి చెందినవారూ నూతనంగా శ్రమించవలసినదే. క్రొత్తగా జీవిత విలువలను నిర్మాణం చేసుకోవలసినదే.

ఇందుకొక కారణమున్నది. సృష్టిలో జననమరణముల నేవి రెండున్నాయి. ఆరెండిటి నడుమ కాలమనేది వయస్సును సృష్టిస్తున్నది. ఒక దేశప్రజల మంచి చెడ్డలమీద, వారి అభివృద్ధి పతనములమీద జననము మరణము వయస్సు అనే మూడింటి యొక్క ప్రభావం చాలావున్నది.

40 ఏళ్ళక్రిందట భారతజాతీయోద్యమ కాలంలో, దేశం విదేశపాలనలో మగ్గుచున్నపుడు యువకులలో దేశాభిమానం పొంగిపొర్లేది. వారిగదులలో సుభాస్‌బోస్, వివేకానంద, మహాత్మాగాంధీ, ఛత్రపతి శివాజీల చిత్ర పటాలు అలంక రించబడేవి. వారి బల్లలమీద వినాయక దామోదర సావ ర్కార్‌చే రచింపబడి బ్రిటిష్ ప్రభుత్వంచే నిషేధింపబడిన 1857 స్వాతంత్ర్యసమర గ్రంథం వుండేది. "కర్మణ్యేవాధి కారస్తే మాఫలేషు కదాచన" - పని చేయుటయందే నీకు అధికారమున్నదిగాని ప్రతిఫలముమీద కాదు అనే సూక్తి వారి ప్రతి చర్యలోను నడకలోను కనిపించేది.

గాంధీజీవరకె అతిస్వల్ప వ్యయంతో నిరాడంబర జీవి తాన్ని గడపాలి అని ప్రయత్నించేవారు. వ్యాయామశాలల్లో

వ్యాయామం చేసేవారు. ఉదయం యోగాసనాలు అభ్యసించే వారు. జాతీయ భాషయగు హిందీని విరామ సమయంలో నేర్చుకొనేవారు. కేవలం పరీక్షలకొరకు చదివి తృప్తిపడక పాఠ్యగ్రంథాలలో లేనటువంటి ఎంతో అదనపు విజ్ఞానం వెదికి గ్రహించేవారు. ఆత్మవిశ్వాసం వారిలో వెల్లివిరిసేది. తల్లి దండ్రులు వారిని చూచుకొని మురిసిపోయేవారు.

1970 వచ్చింది. స్వరాజ్యం వచ్చిన పిదప జననమందిన బిడ్డలు ఈనాడు కళాశాలల్లో చదువుతున్నారు. ఇప్పటి పరిస్థితి మరొక విధంగావున్నది. పలువురు యువకుల గదులలో కనిపించేవి డబ్బుకొరకు నగ్నత్వాన్ని ప్రదర్శించే యువతుల వర్ణ చిత్రాలు. అచట వినిపించేది బాల్ రూంమ్యూజిక్. వారి మనస్సులనాకర్షించేది హత్యలగురించిన గాథలు. వారి ఇష్ట దైవతములు సినిమా తారలు.

ఇన్ని ప్రలోభాలనడుమ వారి మనస్సులు పాఠ్య గ్రంథాల మీదికి పోవడం ఎంతో కష్టం. అందుచేత వారు చేసేకృషి అత్యల్పం. సమర్థత పెంచుకోవాలనే దృష్టివారికి లేదు. ఫలితం మీదనే ఆసక్తి. అందుచేత అల్పశ్రమ, అనల్ప ప్రతిఫలం(Least effort and optimum result) అనేది ఆదర్శ మైపోయింది.

దేశంయొక్క, సమాజంయొక్క మంచి చెడ్డలు వారి మనసులలోనికి రావు. వాటిఎడల తమ బాధ్యతలేమో తెలియవు.

యాంత్రికంగా చదువుతున్నారు; డిగ్రీలు పొందుతున్నారు. వ్యక్తిత్వం వికసింపచేసుకోడానికి, గుణాలను పెంపొందించు కోడానికి, కృషిచేయరు. వారికి ఏవిషయమూ క్షుణ్ణంగా తెలుసుకునడానికి వీలులేదు. విజ్ఞానానికిదూరంగా అజ్ఞానానికి దగ్గరగా వుంటున్నారు. కేవలం సర్టిఫికెట్ మాత్రంపుచ్చుకొని బయటికి వస్తున్నారు. ఈ పరిస్థితినిజూచి తల్లిదండ్రులు వ్యథ చెందుతున్నారు.

40 ఏళ్ళ వ్యవధిలో ఇంతటి తేడా ఎలావచ్చింది? ఆనాడు దేశంఎదుట ఉత్తమచరిత్రలుగల ఆదర్శవ్యక్తులున్నారు. గాంధీజీ యొక్క నిరాడంబరజీవితం ప్రజలఎదుటవుండేది. యువక హృదయ సామ్రాట్టు సుభాస్ చంద్రబోస్ ఆదేశం వినిపిస్తుం డేది. దేశభక్తులను తయారుచేసే కర్మాగారమనదగిన కాశీ హిందూ విశ్వవిద్యాలయంనుండి నాయకులు తర్ఫీదయ్యేవారు.

ప్రజల మనిషి ప్రకాశంపంతులు త్యాగచిహ్నంగా ఎదుట కనిపించేవాడు. అన్నిటికంటె ప్రధానంగా ఒక విదేశ ప్రభుత్వం కళ్ళఎదుట వుండడంవల్ల యువకులలో త్యాగనిరతి, ఆత్మాభిమానం సాక్షాత్కరించేవి. కష్టపడి పైకిరావాలనే పట్టుదల వారిలో వుండేది.

"మరణం" అనేది గాంధీ, సుభాస్, పటేల్ లాంటి వారిని తీసుకుపోయింది. ఆ తరానికిచెందినవారంతా రాలి పోయారు. "జననం" అనేది క్రొత్తతరంవారిని తీసుకువచ్చింది. దేశం అదే; మనుషులుమాత్రం మారారు.

ఈ శ్రోత్ర మనుషులకు ఎల్ల కాలం పనికివచ్చే సంగతులు ఎవరు నేర్పుతారు? పనిమీద ప్రేమ ఎవరు కలిగిస్తారు? నిజాయితీ ఎవరు అలవరుస్తారు? చేపట్టిన కార్యంలో నిమగ్నత ఎవరు బోధిస్తారు? ఇపుడు విదేశ ప్రభుత్వం లేదుగదా! మరి దేశభక్తి ఎలా అలవడుతుంది? ఇవన్నీ అలవడకపోతే రాబోయే తరంవారు ఎలా అభివృద్ధిసాధిస్తారు?

అందుకై సరియైనవిద్య కావాలి. అందుకుతగిన యంత్రాంగంకావాలి. ఒకతరం అంతరించి మరొకతరం వచ్చినప్పటికీ, ఆదర్శపురుషులు మరణించినప్పటికీ, శత్రువుల ప్రమాదం లేకపోయినప్పటికీ దేశానికి అవసరమైన గుణసంపద గల, సమర్థతగల "వ్యక్తులయొక్క నిర్మాణం" అనేది నిత్యం జరుగుతూవుండాలి. అందుకుపయోగించేదే సరియైన విద్య.

విద్యఅంటే కేవలం చదువుకాదు. విద్యఅంటే శిక్షణ. విద్యఅంటే కొన్నికోట్లమందికి వెదిచీకటో ఏదివెలుగో చూపేటువంటి, ఏమిచేయాలో ఏమిచేయరాదో తెలిపేటువంటి బోధన విద్య పొందటం అదృష్టం; విద్యను బోధించడం అంతకంటె అదృష్టం!

ఈరకమైన విద్యద్వారా సమాజం నిత్యనూతనమైన ఆలోచనలతో, సంసిద్ధతతో, కార్యదీక్షతో నవయావనాన్ని సంతరించుకుంటూవుంటే, ముసలితనం రాకుండా వెనుకడుగు వేయకుండా జాతిప్రపంచంలో రాణించగలుగుతుంది. అంత

ర్గత మైన లోటుపాట్లను తొలగించి జాతిని పుష్టివంతంచేసే శక్తి విద్యకుండాలి.

అందుచేత ఆరోగ్యవంతమైన దేశానికుండవలసిన ప్రాతిపదికలు, దేశాధినేత శ్రద్ధవహించాలనుకునే ప్రధానవిషయాలు: ఉత్పత్తి, రక్షణ, విద్య!

---

దేశంయొక్క ప్రాతిపదికలు—4

## ప్రజలవిూద ప్రేమ

దేశానికి వుండదగిన మూడు ప్రాతిపదికలు వస్తూత్పత్తి, రక్షణ శక్తి, సరియైన విద్య అని అనుకున్నాం. వీటికి కారణభూతులైన ఉత్పత్తిదారుడు, సైనికుడు, ఉపాధ్యాయుడు – వీరుముగ్గురూ సమాజంలో విశిష్టమైన కార్యభారాలను వహిస్తున్నారు.

ఈమూడింటిలో ఏదిఎక్కువ ప్రధానం అనేప్రశ్న ఉత్పన్నంకావచ్చు. ఏఒకటి లోపించినా మిగతారెండూ నిరుపయోగ మవుతాయి. మూడు కాళ్ళ మేజాబల్లకు ఏకాలు లేకపోయినా పనిచేయదు.

సంపద లేకుండా రక్షణశక్తిని పెంచుకుంటూపోతే సైన్యం దేశానికి గుదిబండగా తయారవుతుంది; సంపదవుండి

సైనికశక్తి లోపిస్తే అసమర్థుని వద్దగల రత్న భాండాగారము వలె సంపద శత్రువుల పాలవుతుంది; ఈ రెండూవుండి సరియైన విద్య లేనట్లయితే నూతన తరంవారికి సంసిద్ధత లేనందున పై రెండూ దుర్వినియోగమవుతాయి. అందుచేత ఈ మూడింటి నడుమ సున్నితమైన సమన్వయం నిలబెట్టుకోవాలి.

మూడుకాళ్ళు వుండగానే సరిపోదు. వాటి పైన నున్నని రమ్యమైన చెక్క వుంటుంది. ఆచెక్కకు అవి మేకులతో బంధింపబడివుంటాయి. అపుడు మాత్రమే ఆబల్ల ఉపకరిస్తుంది.

ప్రజలమీాది ప్రేమయే ఆచెక్క. మనం ఏ దేశంలో జీవిస్తున్నామో, ఆ ప్రజలు నావాళ్ళు; వారిసుఖమే నాసుఖం; వారికష్టమే నాకష్టం. వారిలో లోపాలుండవచ్చు; వారు అజ్ఞానులు కావచ్చు; దరిద్రులు కావచ్చు. కీకారణ్యాలలో జీవించే కోయలు, బోయలు, భిల్లులు మొదలు గ్రామ వాసులైన వ్యవసాయ కూలీలు, వడ్రంగులు, జాలరులు నుండి నగర వాసులైన కార్మికులు, ఉద్యోగులు, రచయితలు-యావన్మందీ నావాళ్ళు. వారి బాధలు నాకుగూడ బాధలే; వారి సంతోషంలో భాగమే నాసంతోషం అనే ఎరుక అత్యంత ఆవశ్యకం. ఇట్టిఆలోచనగనక లేకపోతే వస్తూత్పత్తి, సైనికశక్తి, విద్య, నిరర్థకములవుతాయి. ఒకొక్కసారి అపకారంగూడ కలిగిస్తాయి.

ప్రజలమీది ప్రేమకు మరొక పేరు దేశభక్తి. దేశభక్తిలేని వారికి కోట్ల రూపాయలు చేతికిచ్చి నదిమీద ప్రాజెక్టు కట్టమంటే డబ్బు జేబుల్లోకి పోతుంది; ప్రాజెక్టు కొట్టుకు పోతుంది. నాగార్జునసాగర్ వద్ద కృష్ణానదిమీద కట్టిన వంతెన కొట్టుకుపోయింది. తెలంగాణా ప్రాంతంలోని కడెం ప్రాజెక్టు కూడ గంగ పాలయింది. ఎంతవిచారకరం!

రక్షణ విషయంగూడ యింతే. 1962లో చైనాతో యుద్ధంజరుగుతున్నపుడు కొన్నికోట్ల రూపాయలు ఖరీదు చేసే ఉన్నివస్త్రములు, ఇతర చలిదుస్తులు, సైనికులకోసం ప్రభుత్వం పంపితే అవిసైనికులకు చేర్చకుండా కలకత్తాలో అమ్మి వ్యక్తులు డబ్బుచేసుకున్నారు. సైనికులు మంచుకొండల్లో తగిన ఉన్ని దుస్తులు లేక అగచాట్లుపడ్డారు. ఎందువల్ల? అందుకు సంబంధించిన వారిలో ప్రజలమీద ప్రేమలేదు; సైన్యం మీద ప్రేమ లేదు. ఉన్నదల్లా తమమీద తమకు ప్రేమ!

విద్య విషయంగూడ అంతే. గొప్ప చదువులు చదివినంతమాత్రాన సరిపోదు. దాని వెనుక ప్రజలమీద ప్రేమ అనేదివుండాలి. పెద్దచదువులు చదివిన కొందరు డాక్టర్లు గ్రామసీమల్లోని ఆసుపత్రులలో నియమించబడితే వెళ్ళడానికి ఇష్టపడరు. కారణమేమంటే, వారుపొందిన విద్య వెనుక ప్రజలమీద ప్రేమ అనేదిలేదు.

దేశభక్తిలేని అజ్ఞానులకంటె, దేశభక్తిశూన్యులైన విద్యావంతులవల్ల దేశానికి అపకారం అధికం. దరిద్రులకు,

బలహీనులకు దేశభక్తి లేకపోతే అంతనష్టం వుండకపోవ
గాని తెలివితేటలు కలిగిన ఉన్నతశ్రేణి వ్యక్తులకు ప్రజలమీ
ప్రేమ లేనట్లయితే సమాజానికి హాని ఎక్కువగావుంటుంది.

"దేహాభక్తి" స్థానంలో దేశభక్తిని అలవరచుకుంటే
జాతికి పురోగతివుండదు. ఉత్పత్తి, రక్షణ, విద్య, సహి
నిప్రయోజనములవుతాయి.

దేశభక్తి అనేది ఆత్మలోపల ఉంటేతప్ప సమాజమ
శరీరము తన కార్యకలాపములను సక్రమంగా నిర్వహించజాల

---

చిన్నకథలో పెద్ద గుణపాఠం

## ఎద్దు కథ

---

గొడ్ల సావిట్లో ఎద్దు మేత మేస్తూవున్నది.

దానికొమ్ముమీద దోమవచ్చి వాలింది. ఎంతోసే
కొమ్ముమీద కూర్చున్నది.

'పాప మీఎద్దును బాధపెడుతున్నానే' అని దాని
అనిపించి, "ఏమండీ ఎద్దుగారూ! మీకొమ్ముమీద ఎంత
సేపటినుంచి కూర్చున్నాను. మీకు యిబ్బంది కలిగించా

ఏమో. నాకే బాధగావుంది. ఇహ వెళ్ళిపోతాను" అని చెప్పింది.

ఎద్దుకు నవ్వొచ్చి "అబ్బెబ్బే! నీవు కూచున్నట్లే నాకని పించలేదు. నాకు ఇబ్బందేమిటి? అదేమీ లేదు. నీ వంశాన్నంత టినీ తెచ్చి నా కొమ్ముమీద కాపురం పెట్టినా నాకువచ్చే నష్ట మేమీ లేదు" అని నిశ్చలంగా జవాబు చెప్పింది.

మనకు వచ్చే కష్టాలతో ఈమాట ఎందుకు చెప్పలేము?

జ్వరంవస్తుంది; చెయ్యి విరుగుతుంది; తుఫాన్‌లో కాలవ గట్టున పదిమైళ్ళు నడవవలసివస్తుంది; మంచంలోవున్న సోదరు డికి అర్థరాత్రి నిద్రపోకుండా సేవచేయవలసివస్తుంది — ఇలా వచ్చేకష్టాలకు అలాంటి సమాధానం ఎందుకివ్వలేం?

మానవుడు 70, 80 ఏండ్లుజీవిస్తాడు. అంత జీవితంలో ఒక్కరోజున వచ్చేటువంటి కష్టం ఏపాటిది? "కొండను ఎలుక ఏమీ చేయలేదు; నన్ను కష్టాలు ఏమీచేయలేవు" అని నిశ్చ లంగా భావించగలవాడే జీవితాన్ని ఎదుర్కోగలడు!

— స్వామి వివేకానందుని ఉపన్యాసం ఆధారంగా

---

కప్పిచెప్పేది కవిత్వం
విప్పిచెప్పేది విమర్శనం

—డా॥ సి. నారాయణరెడ్డి

# ఉత్సాహశక్తి

---

ఒకవ్యక్తి అధిక శ్రమను ఎలా ఓర్చుకోగలడు? అతనికి అదనపు శక్తి ఎలావస్తుంది?

ఒక ప్రభుత్వోద్యోగియొక్క భార్య జబ్బువలన మంచం పట్టింది. ఆసుపత్రిలో చేర్చారు. అతనికి సెలవు దినములు లేవు. అందుచే నతడు పగలు ఆఫీసులో ఉద్యోగంచేయాలి. కనుక పగటిపూట ఆతని సోదరి ఆసుపత్రికి వెళ్ళి అతనిభార్యకు ఉపచారం చేస్తున్నది.

ఆతడు ఆఫీసునుండి వచ్చినది మొదలు మరుసటి ఉదయం వరకు ఆసుపత్రికి వెళ్ళి భార్యకు ఉపచారంచేస్తున్నాడు. రాత్రులందు నిద్రలేదు. వేళకు ఆహారంలేదు. ఇట్లుదినములు, నెలలు, గడచిపోతున్నాయి.

అట్లు పనిచేయుటకు అతనికి శక్తి ఎక్కడిది? "భార్యమీాది అనురాగము" అతనికి ఆశక్తినిస్తున్నది.

ఒక వ్యక్తిమీాదిప్రేమ వలన అతడు అదనపు శ్రమ పడగలుగుతున్నాడు!

సామాన్యంగా ఉద్యోగస్తులు సాయంకాలం 5 గంటలకు నీరసించిపోతారు. కాళ్ళు పీక్కుపోతాయి. అదేవ్యక్తి

తనభార్య, బిడ్డలకు జబ్బు చేసినపుడు అధిక శక్తితో పనిచేస్తున్నాడు. ఆశక్తి ఇంతకుముందు ఎచట దాగివున్నదో, ఇపుడు ఎచటినుండి వచ్చినదో వైద్యశాస్త్రము చెప్పజాలదు. ఆరహస్యమును గ్రహించడ మవసరం.

ఒకవ్యక్తిపై అనురాగము ఎక్కువశ్రమ పడుటకు కారణమైనది. అట్లే జీవితమునకు గమ్యమేర్పరచు కొనుట, గొప్ప ఆశయముచేత ఉత్సాహము పొందుట, అట్టి ఆశయమునకు కట్టుబడియుండుట, ఆపిమ్మట బాహ్యప్రపంచములో పనిచేయనారంభించుట - అదియే మనలో ఉత్సాహశక్తిని రగుల్కొల్పు రహస్యమై యున్నది.

పూర్వకాలంలో ధర్మము, మతము, గమ్యస్థానములుగ నుండెడివి. నేడవి మరుగున పడ్డాయి. దేవుడు సర్వవ్యాపి యనుటవలన ఉత్సాహము కలుగదు. కనుక దేశసౌభాగ్యమును దానిని ఆశయంగా స్వీకరించాలి. దేశం మీది ప్రేమయే మనకు అధికశక్తినివ్వాలి.

అందరూ ఒకే స్థలమున ఒకే పని చేయుటకు వీలుండదు. కనుక ప్రతియొక్కరు వారివారి స్థానములందు భారము వహించాలి.

విద్యార్థి, ఉపాధ్యాయుడు, వ్యవసాయదారుడు, గుమాస్తా, సైనికుడు, ఇలా ప్రతిఒక్కరూ పనిచేయ వలసియున్నది. వారివారి కార్యక్షేత్రములే వారికి బృందావనములు.

ఆబృందావనమున వేణుగోపాలునితో నృత్యమాడుతూ దేశ సౌభాగ్యమునకు సహాకరించాలి. ప్రతియొక్కరూ వారివారి పనులందు ఉత్సాహముతో వ్యవహరించుటే నృత్యమవుతుంది.

— స్వామి చిన్మయానంద.

---

మాటా-మంతీ-5

# ఎక్కువ తక్కువలు

పుట్టేటపుడు ప్రతివాడూ గోచీ అయినా లేకుండా పుడతాడు; పోయేటపుడు అద్దమైనా ఇవ్వకుండా పోతాడు!

ఈ జననమరణాల నడుమ ఎన్నో తారతమ్యాలు; ఎన్నో అంతస్థులు; ఎంతో అహంకారం. తాను అధికుడనని విర్రవీగడం; క్రిందివారిని ఈసడించడం.

ఎవరు ఎక్కువ? ఎవరు తక్కువ? స్మశానంవద్ద అందరూ సమానులే. ముందు వెనుకగా అందరు చేరేదీ అక్కడికే. ఈలోగా అధికులనీ అల్పులనీ అనుకొని ఒకరినొకరు దూరం చేసుకుంటూ వుంటారు.

కొందరికంటె తాను జన్మవల్ల ధనంవల్ల అధికుడనని భావించుకొని పరులను ఈసడించుకొని హీనంగా చూడడం

యావత్తు సమాజంయొక్క సమగ్ర శ్రేయస్సుకు హాని కలిగి స్తుంది.

"అందరు మానవులూ అన్నివిషయాలలోనూ సమానులు కాకపోవచ్చు; కాని వారందరూ సమానంగా మానవులేగద!" అని హ్యూ గెయిట్‌స్కెల్ అను బ్రిటిష్ లేబర్ పార్టీనాయకుడు వెల్లడించిన భావంలో ఎంతైనా సత్యమున్నది. (It may be that men are not equal in all respects, but they are all equally men — Hugh Gaitskell)

మనంచేసే పనులలోగల వైవిధ్యంవల్ల, మనశక్తి సామర్థ్యాలలో తారతమ్యంవల్ల మనలో ఎంతో అనేకత్వంవున్నది. ఈ అనేకత్వం అనేది పుష్పజాతులలోని వివిధరంగులవలె, పక్షిజాలమునకుగల వివిధగొంతులవలె వేర్వేరుగా కనిపించవచ్చు. ఏడురంగుల కిరణాలు ఒకే ధవళ కిరణంనుండి వెలువడినట్లు ఇందరు మానవులను ఒకేవిధమైన చైతన్యం నడిపిస్తూవున్నది.

అలాంటపుడు యావత్తు ప్రాణికోటిని తనతో సమానంగా ఆదరించ లేకపోయినా, కనీసం ఆప్రేమ అనేది మానవులవరకైనా విస్తరింప చేయాలి. ఎక్కడో విదేశాలలో నున్న జనావళిని ఆదరించడం ఎలావున్నా, కనీసం స్వదేశీయులందరినీ సహోదర భావంతో స్వీకరించడం అత్యవసరం.

కేవలంసైనిక బలంవల్ల ఒక దేశానికి రక్షణ కలుగదు. దేశ ప్రజల నడుమగల మమకారంవల్ల దేశానికి నిజమైన రక్షణ ఏర్పడుతుంది; బలంచేకూరుతుంది; పుష్టి ఏర్పడుతుంది.

అందుకై మనిషిని మనిషిగా స్వీకరించి ఆప్యాయతతో పలకరించడం ఆదరించడం అత్యావశకరం.

---

పనిలోని మాధుర్యం-9

# వినమ్రత

పనిసాధించడమనేది ఒకకళ. జీవితంలో ఎట్టి బృహత్కార్యం సాధించాలన్నా పనిలో నిమగ్నత అనేది ముఖ్యంగా అవసరం. ఆషామాషీగా, పట్టీపట్టనట్లు వ్యవహరించడంవల్ల ఏకార్యమూ సాధించబడదు.

నెపోలియన్ లాంటివాళ్ళు మొదట నిద్రను ఆకలిని జయించి తరువాత దేశాలను జయించారు. వైద్యశాస్త్రంలో గాని; విజ్ఞానశాస్త్రంలోగాని ఆధునికమైన పరిశోధనలు చేస్తున్నవారు శారీరకమైన సుఖాలను విస్మరించిన పిదప మాత్రమే విశిష్టమైన సిద్ధాంతాలను కనుగొనగలుగుతున్నారు.

జీవితాన్ని సుఖపెట్టుకుందా మనుకున్నంతవరకు జీవితంలో సుఖమే దుర్లభమవుతుంది. శ్రమనూ కష్టాన్నీ ఆహ్వానించి ఒక విశిష్టమైన ఆదర్శాన్ని సాధించడానికై మానవుడు కృషి చేస్తున్నపుడు ఆ సాధనలో తృప్తి, ఆనందం లభిస్తాయి. అవసరమైతే కార్యసాధనకై అతడు అహంకారాన్ని తగ్గించుకొని వినమ్రుడవుతాడు; అంతేగాని అల్పుడు కాడు. అందుకే ఒక అజ్ఞాత తెలుగు కవి ఇలా అన్నాడు :

చేతనగువాడు కార్యము
కై తగ్గుట వంగుగాక యల్పుండగునా?
ఏతము చడి దావంగును
పాతాళము నీరు తెచ్చి బయలం జల్లున్.

ఏతము యొక్క కర్ర బావిలోనికి వంగి పాతాళమంత లోతుకు పోతుంది. అది అంతటి లోతునకు పోవడంవలననే నీటిని తెచ్చి వెలుపల ఇవ్వగలుగుచున్నది. అలాగే, కార్యసాధకుడు తనకృషిలో ఇతరులయెడ నమ్రత చూపునేగాని అల్పుడు కాడు!

---

స్నేహితుణ్ణి కలిగియుండే ఏకైకమార్గం స్నేహితుడుగా వుండటమే.

— ఎమర్సన్

# వీరపాండ్య కట్టబొమ్మన్

---

అది 1799వ సంవత్సరం. వ్యాపారం పేరుతో వచ్చిన బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీవారు భారత దేశంలో రాజ్య స్థాపనకు దిగారు. మూడవ కర్ణాటక యుద్ధానంతరం ఆర్కాట్ నవాబు కంపెనీవారి గులాము అయినాడు.

ఆర్కాట్ నవాబుయొక్క సామంతులకు పాలెగాళ్ళు అని పేరు. వారు 70 మంది దాకా వున్నారు. వారందరూ ఇకనుండి ఆంగ్లేయులకు కప్పం కట్టవలసిందిగా 1792లో నవాబు ఫర్మానా జారీచేశాడు. దాదాపు అందరూ కంపెనీ వారికి కప్పం కట్టడానికి తలయొగ్గారు. కురిచ్చికోట రాజగు వీర పాండ్య కట్ట బొమ్మన్ మాత్రం వ్యాపారానికై వచ్చి రాజ్య స్థాపనకు దిగిన కంపెనీ వారికి తాను గులాము కానని ప్రకటించాడు.

అసలు ఆ మహావీరుని పేరు "కురుత్తయ్య". అతని వంశంపేర్లు "జగ వీర పాండ్య కట్ట బొమ్మ నాయక." కురుత్తయ్య ఈ వంశంలో 47వ వాడు. 1760లో జన్మించి 1790లో సింహాసన మధిష్ఠించాడు. ఈవంశానికి మూల పురుషుడైన కట్టబ్రహ్మన్న 1100 సంవత్సరంలో ఆంధ్రదేశంనుండి తమిళ

నాడుకు వలసపోయి పుదుక్కోట సమీపంలోనున్న "పాంచా లన్ కురిచ్చి" కోటను నిర్మించాడు.

1799 సెప్టెంబరు 5వ తేదీన పాంచాలన్ కురిచ్చిలో కట్టబొమ్మన్ స్వాతంత్ర్య సమర శంఖాన్ని పూరించాడు. కాకులు గూడ కట్టబొమ్మనాయకుని కోటపై ఎగుర సాహ సించవు (కాగముమ్ పరక్కాద కట్టబొమ్మన్ కోట్టై) అని పేరొందిన పాంచాలన్ కురిచ్చి కోట ఆంగ్లేయుల ఫిరంగుల ధాటికి మూడురోజులు తట్టుకొని నాలుగవరోజు వశమైంది. కోటనుండి కట్టబొమ్మన్ 60 మందితో తప్పించుకొని "కోలార్ పట్టి" చేరుకున్నాడు.

భారతదేశం ద్రోహులవల్లనే పరాధీనమైన సంగతి ఇక్కడ గూడ కనిపిస్తుంది. కంపెనీ వారి అడుగులకు మడుగు లొత్తే ఎట్టియాపురం పాలెగాడగు "ఎట్టప్ప" ఆంగ్ల సేనాని యగు మేజర్ బానర్ మన్ వద్దకు వెళ్ళాడు. కట్టబొమ్మన్ యొక్క ఉనికి తెలిపాడు. 1200 మంది ఆంగ్ల సైన్యాన్ని వెంట దీసుకొని ఎట్టప్ప "కోలార్ పట్టి"లో వున్న కట్టబొమ్మన్ మీదికి దాడి చేశాడు.

అశ్చర్యం! 60 మంది వీరయోధులతో 1200 మంది శత్రువులనెదుర్కొని దాటి చూస్తూవుండగానే కట్టబొమ్మన్ కురుత్తయ్య కోలార్ పట్టినుండి తప్పించుకుపోయాడు! తెల్ల వాళ్ళు తెల్లమొగాలు వేశారు.

"కట్టబొమ్మన్ కు ఆశ్రయ మిచ్చినవారికి మరణ దండ నమే శిక్ష. అతని ఉనికినైనా తెలిపిన వారికి బహుమాన మిస్తాం" అని మేజర్ బానర్ మన్ ఆజ్ఞ జారీచేశాడు.

పుదుకోట పాలెగాని పేరు విజయ రఘునాథ తొండైమాన్. అతడు మిత్రునివలె నటించి కట్టబొమ్మన్ కు, అతని సహాచరు లేడుగురికి ఆశ్రయమిచ్చాడు. వీరు పుదుకోటలో నున్నట్లు రహస్యంగా ఆంగ్లేయులకు తెలియచేశాడు. నిరాయుధులుగాఫ్రండి నిద్రిస్తున్న సమయంలో శత్రుసైన్యం ఎట్టప్ప నాయకత్వాన కట్టబొమ్మన్ మీద పడింది.

ఒక్క ఆయుధం అందుబాటులోవున్నా కళ్ళలో దుమ్ముకొట్టి పోగల సమర్థుడు కట్టబొమ్మన్. అందుకే ఎట్టప్ప తొండైమాన్ తో "కట్టబొమ్మన్ వద్ద చిన్న ఆయుధమైనా లేదుగదా!" అని అడిగి అనుమానం తీర్చుకొనిన పిదప మాత్రమే కట్టబొమ్మన్ను సమీపించాడు.

కట్టబొమ్మన్ ఖైదు చేయబడ్డాడు. మేజర్ బానర్ మన్ అతనికి ఉరిశిక్ష వేశాడు. కట్టబొమ్మన్ తన ఎదురుగా కూర్చున్న పాలెగాళ్ళందరినీ నీచులని పేర్కొంటూ వికటాట్ట హాసంచేశాడు. తరువాత తనంతట తానే ఉరికంబమెక్కి ఉరి వేసుకున్నాడు.

ఎట్టప్ప, తొండైమాన్ లవంటి స్వదేశీయులే ఒక దేశభక్తుని పరాజయానికీ మరణానికీ కారణులవడం ఎంత బాధాకరం!

—శ్రీ బూరుగు వ్యాసకృష్ణ, పమిడిముక్కల

పనిలోని మాధుర్యం-10

# నైపుణ్యం కొరకు నెపోలియన్ సలహా

---

ఒక్కొక్కసారి అనుభవజ్ఞులు చెప్పే చిన్నవాక్యంలో కూడ పెద్దభావం పొదగబడివుంటుంది. సామాన్యులకది మార్గదర్శకంగా ఉపకరిస్తుంది.

నెపోలియన్ బోనాపార్టీ ప్రఖ్యాత ఫ్రెంచి అధినేత. 1800 మొదలు 1812 వరకు యూరోపులో స్పెయిన్ నుండి ప్రష్యావరకు అనేక దేశాలను జయించాడు. ఫ్రాన్సులో విశిష్టమైన పరిపాలనా పద్ధతి ప్రవేశ పెట్టాడు.

అతడు తన సైనాధ్యక్షులను సంబోధిస్తూ "Be clear, the rest will follow" అని సూచన చేశాడు. ఈ వాక్యంలో విశిష్టమైన సత్యం ఇమిడివున్నది. విజయానికి మార్గం సూచింపబడింది.

ఏదైనా పెద్ద పని తలపెట్టినపుడు మొండిగా బరువంతా మీదవేసుకొని చేస్తూపోతారేగాని, ఆ పనిని కొన్ని భాగాలుగా విభజించి ఏ పనికి ఎవరు సమర్థులో వారికి దానిని వప్పగించి అనేకుల చేత పనిచేయించడం పలువురికి తెలియదు.

ఒక పద్ధతిలో వస్తువులనుంచడం, క్రమమార్గంలో పనులు చేయడం, ఏ సమయంలో చేయవలసిన పనిని ఆ సమయంలో చేయడం అనేకులకు తెలియదు.

కొందరి ఇళ్ళలో మేజాబల్లమీద కుంపటీ బొగ్గుల డబ్బా మినహా అన్నీ చోటుచేసుకొని వుంటాయి. దాని మీదనే దువ్వెనలూ, సున్నంపిడత, గడ్డంపెట్టె, కూరలబుట్ట, పౌడరుడబ్బా, గోనెసంచి - ఒకటేమిటి ఇంటిల్లిపాదీ చేతికందిన వస్తువుల్లా తెచ్చి బల్లమీద కుప్పపోస్తూవుంటారు. చదువుకోడానికీ వ్రాసుకోడానికీ చీకాకు వేస్తుంది. మతిపోయినట్లుంటుంది,



అందుకే "Be clear, the rest will follow" అని నెపోలియన్ అన్నాడు. ప్రతిదాన్నీ తేట తెల్లంగా సవివరంగా వుంచుకో; మిగతా సత్ఫలితం దానంతటదే వస్తుందని అన్నాడు.



సైన్యాధిపతి యుద్ధంచెయ్యబోయే ముందు అన్ని వివరాలను ఆఖరు విషయంవరకు స్పష్టపరచుకోవాలి. అతి చిన్న సంగతిగూడ దృష్టిలోకి తీసుకోవాలి. యుద్ధసమయంలో ఏ సైనికదళం ఎక్కడుండాలి; వాళ్ళకు ఆయుధసరఫరా ఎవరు చేయాలి; నదిని ఎక్కడ దాటాలి; ఏరోడ్లు ఉపయోగించాలి; ఇలాంటి అనేక వివరాలను సైన్యాధికారి గ్రహించాలి. మూఢ ఉన్మాదిగా వ్యవహరించగూడదు.



సామాన్య ప్రజలుసైతం తాము చేపట్టిన పనిని నైపుణ్యంగా చేయాలంటే నెపోలియన్ చెప్పినసూక్తి ఉపకరిస్తుంది. విషయాలను తేటతెల్లంగా విశదంగా వుంచుకో; విజయం దానంతటదే వస్తుంది!

---

# మనవి

పుస్తకం ఆసాంతం చదివారా? ఐతే, ఈపుస్తకం గురించి మీ విమర్శనాత్మకమైన అభిప్రాయం మాకు తెలియజేయండి. ముందుముందు మరింత మంచిపుస్తకాలు వెలువరించడానికి మీ విమర్శలు ఉపకరిస్తాయి.

శ్రీ కంచికామకోటి పీఠాధిపతులు శ్రీ శ్రీ శ్రీ జయేంద్రసరస్వతీ స్వామివారి ఆనతి ప్రకారం, వారి ఆశీస్సులతో 1969 నవంబరులో "యువభారతి" పత్రికను గుంటూరు నుండి ప్రారంభించాం. అందు వెలువడిన రచనలలో విశిష్టమైన కొన్నిటిని ఈపుస్తక రూపంలో పాఠకులకందజేస్తున్నాం. ఇలాంటిదే మరొక సంకలనం గూడ త్వరలో ప్రచురించనున్నాము.

ఈప్రచురణల నిర్వాహణలకై "యువభారతి ఎడ్యుకేషనల్ సొసైటీ (రిజిష్టర్డు) ప్రారంభించాము. ఆసంస్థకు అధ్యక్షులుగా నుండి దీనిఅభివృద్ధికై అనేకవిధములు సహాయమందించుచున్న ఆంధ్రప్రదేశ్ ఆర్థికశాఖామాత్యులు శ్రీ పిడతల రంగారెడ్డి గారికి, కార్యవర్గ సభ్యులకు, మా ధన్యవాదములు.

మా రాబోవు ఇంకొక పుస్తకము "లోకజ్ఞానం" (General Knowledge) విద్యార్థులకు మిక్కిలి ఉపయుక్తముగా నుండగలదు. పాఠకులనుంచి ప్రోత్సాహం లభించగలదని ఆశిస్తున్నాం.

మన్నవ గిరిధరరావు ఎం. ఏ.,
సంపాదకుడు, "యువభారతి" (మాసపత్రిక)
కృష్ణనగర్, గుంటూరు-522 004

వెల్‌కమ్ ప్రెస్ ప్రైవేట్ లిమిటెడ్, గుంటూరు-2